13.5.1994 శుక్రవారం, 10 పేజీలు, సంపుటి: 65. సంచిక: 19. విడి ప్రతి: రు. 2.00 లు

Regd. No. HNL. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు   జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి.



# శేషన్ భూతం పీక నులిమేస్తోంది!

రాష్ట్ర ఎన్నికల చరిత్రలో కర్నూల్ లోక్‌సభ ఉప ఎన్నిక విలక్షణమైనదిగా, వినూత్న మైనదిగా గుర్తుండి పోతుంది. అంగ రంగ వైభవము, అరివీర భయంకరము, ముష్టి, చాణూర, మల్ల యుద్ధ విద్యా కౌశల్య విన్యాసము, ధనలక్ష్మి కాలియందెల రవళి మృదునాదాలతో నభూతో నభవిష్యతిగా జరగ వలసిన ఈ ఎన్నిక- శేషన్ భూతం భయంతో మూగ సినిమా వలె జరుగుతోంది. పార్లమెంట్ ఎన్నికే కాదు - ఆఖరకు పంచాయితీ ఎన్నిక జరుగు తున్నట్లు కూడా లేదు కర్నూలు పరిధిలో తిరిగి చూస్తుంటే. గోడల మీద రాతలు లేవు, నినాదాలు లేవు, బ్యానర్లు లేవు, రెప రెప లాడే జెండాలు లేవు, చెవులు హోరెత్తించే మైకులు లేవు, రొద పెట్టే జీపులు, కార్ల పరుగులు లేవు. ఆడంబరం లేదు, అట్టహాసం లేదు! అంతా నిశ్శబ్దం, నిరామయ పరిస్థితి. ఒక వ్యక్తిని చూసి హేమాహేమీలు, అతి రథమహా రథులైన ఎందరు నాయకులు ఇంతగా హడలి పోవడం, కలలో కన్పిస్తే జ్వరం తెచ్చుకొని తల్లడిల్లి పోవడం ఎప్పుడూ లేదు, ఎక్కడా లేదు. శేషన్ జన్మ నిజంగా ధన్యం.

> **కర్నూలు ఉపఎన్నిక— పార్టీలు, అభ్యర్థులు హడలి చస్తున్నారు!**

ముఖ్యమంత్రి, తన కుమారుడి రాజకీయ ప్రవేశానికి, తన వారసత్వ ప్రకటనకు నాందిగా భావించే కర్నూలు ఉప ఎన్నిక సాధారణ పరిస్థితులలో అయితే అపూర్వంగా జరిగి వుండాలి. కాని 'శేషన్ అందుకు అడ్డు పడుతున్నారు; అడుగడుగునా అటంకాలు కల్పిస్తున్నారు; నీడ వలె అభ్యర్థులను వెన్నాడు తున్నారు. ఎన్నికల నిర్వహణలో కేంద్ర ఎన్నికల సంఘానికి అన్ని అధికారా లున్నాయని మనం కలలో కూడా వూహించి వుండం. ప్రభుత్వ భవనాల పై ఎన్నికల నినాదాలు, అభ్యర్థుల పేర్లు వ్రాస్తే కఠిన చర్య తీసుకుంటామని కలెక్టర్ ప్రకటించారు. ప్రైవేటు ఇళ్లు, గోడల మీద వ్రాసే పనైతే సంబంధిత యజమానుల నుంచి లిఖిత పూర్వక అనుమతి వుండాలి; ఎన్నిక తర్వాత ఎవరైతే పేర్లు వ్రాశారో వారే తిరిగి వాటిని చెరిపేసి, కొత్తగా సున్నం కొట్టించాలి. ఇందులో విఫలమైతే, ఎన్నికైన అభ్యర్థినే కాకుండా, ఓడిన అభ్యర్థిని కూడా శిక్షించే అధికారం శేషన్ తన చేతిలో పెట్టుకున్నారు. ఈ న్యూసెన్సంతా ఎందుకని కర్నూలులో ఉభయ పార్టీల అభ్యర్థులూ గోడల మీద వ్రాతలు వ్రాయడమే మానుకున్నారు. ఎక్కడైనా కార్యకర్తలు పొరపాటున వ్రాసి వుంటే హడావుడిగా చెరిపేస్తున్నారు.

అధికార దుర్వినియోగం అనే మాటకు తావే లేదు. క్రింద నుంచి పై వరకు ఏ అధికారి సాహసించి ఎన్నికల ప్రక్రియలో వేలు పెట్టడం లేదు.

కొరవ 10 పేజీలో



## జాతిపిత నెల్సన్ మండేలా

-జయంపుకృష్ణ

ప్రజల కోసం, ప్రజాస్వామ్యం కోసం
ఒక జీవిత కాలం పోరాటం; ఆరాటం
కటకటాల వెనుక నెల్సన్ మండేలా నిరీక్షణ
స్వేచ్ఛ కోసం, సమత కోసం పడిన ఆవేదన
పాలించిన ఇన్నేళ్లకు పరిపాలకులకు చరమగీతం
ఈనాటికి వినిపించింది నల్లజాతి ఐక్య సంగీతం
నెల్సన్ మండేలా మండే ఒక నల్ల సూర్యుడు
మన జాతిపిత గాంధీజీకి సరైన వారసుడు
తుపాకి తూటాల నుంచి ఓట్ల వైపు మళ్లించాడు
స్వదేశంలో స్వపరిపాలన జండా ఎగరేశాడు
దేశం కోసం మరణించిన త్యాగధనులెందరో?
అందరికీ జాతి అర్పిస్తున్నది కన్నీటి నివాళి
వారి ఆశలు, ఆశయాలు, శ్వాసలు అన్నీ కలిపి
దక్షిణాఫ్రికా జాతీయ జండాకు రంగుల లిపి

## పెండ్లిండ్లు

మాజీ ముఖ్యమంత్రి, రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి గారి మేనకోడలు, అంటే ఆయన సతీమణి శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ సోదరుడు మేడా వెంకటరెడ్డి కుమార్తె శైలజ; దామరమడుగు, శ్రీ పలగాని వెంకట కృష్ణారెడ్డి కుమారుడు వెంకటేశ్వర్లురెడ్డిల పరిణయం మార్చి 31 తేది టిటిడిలో వైభవంగా జరిగింది.

మేనకోడలే అయినా, తన స్వంత కుమార్తె వివాహమంత శ్రద్ధ తీసుకున్నారు జనార్దనరెడ్డి. ఆహ్వాన పత్రికలు ఆయన పేరుపైనే వచ్చాయి; టిటిడిలో స్వాగతమూ ఆయనదే. మండపం కూడా విలక్షణంగా కట్టించారు. మొత్తం వేదికను గోడలతో సహా కాంగ్రెస్ రంగుల్లో పూలతో అలంకరించి; పెండ్లి పందిరి లేకుండా రంగుల కుండలు పెట్టి పాత పద్ధతులను స్ఫురింప జేసి, కొత్తదనం చూపారు. విద్యుద్దీపాలంకరణ కూడా విలక్షణంగా వుండింది.

* * *

కేశవ అండ్ కంపెనీ స్టేషనరీ షాపు ద్వారా సుప్రసిద్ధుడు సోమిశెట్టి రామయ్య కుమార్తె రాధ(బికాం); మద్రాసు, శ్రీ పసుమర్తి కన్నన్ కుమారుడు రవీంద్రనాథ్ బికాం, ఎల్ఎల్‌బి, ఐసి, డబ్ల్యుఎ పెండ్లి ఏప్రెల్ 18 తేది మద్రాసులో జరిగింది.

* * *

సూళ్లూరుపేట, శ్రీ అలవల లక్ష్మీనారాయణ కుమారుడు భాస్కరరావు బికాం; నెల్లూరు శ్రీ చుండూరు వెంకట సుబ్బరావు గుప్త కుమార్తె హేమమాలిని పరిణయం 18తేది నవాబుపేటలో జరిగింది.

* * *

నెల్లూరు డిఐసిలో ఇండస్ట్రియల్ ప్రమోషన్ ఆఫీసరు, చిన్నదైనా పెద్దదైనా పరిశ్రమ పెట్టామని తన దగ్గరకు వచ్చినవారిని మనఃస్ఫూర్తిగా ప్రోత్సహించి, తన శక్తి వంచన లేకుండా సహకరించే స్నేహ స్వభావి. శ్రీ ఎన్. రామచంద్రర్లావు కుమారుడు, ఇండియన్ బ్యాంకు టెక్నికల్ ఆఫీసరు శ్రీనివాసులు ఎంఐఇ; కావలి శ్రీ పగడాల వెంకట శేషయ్య కుమార్తె శ్రీ విజయలక్ష్మి ఎంఎస్‌సి పరిణయం 21 తేది టిటిడిలో జరిగింది.

* * *

శివరాం ప్రింటర్స్ అధినేత, ఇటు ప్రింటింగు, అటు ఫైనాన్సు వ్యాపారాలలో క్షణం తీరిక లేకుండా గడిపే గట్టివాడైన పొట్టివాడు, టౌన్‌లో మంచి స్నేహ సంబంధాలు కల్గిన మిత్రుడు శ్రీ పత్రి గురూజీ కుమార్తె రజిత; మద్రాసు, అశోక్ లేల్యాండ్ అధికారి శ్రీ బి. గోపాల్ కుమారుడు రవి వివాహం 24 తేది రాఘవ కళ్యాణ మండపంలో జరిగింది. రియల్ ఎస్టేట్లు, ఫైనాన్స్ కంపెనీలకు రంగుల

కొరవ 6 పేజీలో

* * *



# అన్ని ఆశలు కల్పించినా దారి తప్పబోవడమేమిటి?

ఎమ్మెల్యే శ్రీ నువ్వుల వెంకటరత్నం నాయుడు మరణం తర్వాత రాపూరు రాజకీయంలో ప్రాబల్యం సంపాదించడానికి చేసిన ప్రయత్నం రభస పట్టింది. నాయుడు గారి తర్వాత రాపూరు నియోజక వర్గంలో పట్టు కల్గినవారు ఆనం కుటుంబీకులే! అభివృద్ధికి ఆమడ దూరంలోవుండే ఈ గ్రామాల్లో రాజకీయం కులపరంగాను, వర్గపరంగాను వుంటుంది తప్ప పార్టీల పరంగా, సిద్ధాంతాల పరంగా వుండదు. అందువల్లే కొత్తవారెవ్వరూ ఇక్కడికొచ్చి నిలదొక్కుకోలేరు.

1972 నుంచి నియోజక వర్గంలో ఆనం, నువ్వుల వర్గాలు చెరొకసారి విజయం, అపజయం చవిచూస్తూ వస్తున్నాయి. ఇద్దరూ కలసి పనిచేసిన మొన్నటి పార్లమెంట్ ఎన్నికలో పద్మశ్రీకి అనూహ్యమైన మెజారిటీ వచ్చింది. ఆరోజు రాపూరులో వచ్చిన మెజారిటీయే పద్మశ్రీని ఎమ్పీని చేసింది; లేకుంటే నెల్లూరు లోక్ సభా స్థానం తెలుగు దేశం పరమై వుండేది.

ఈ వాతావరణంలో, నాయుడు గారు స్వర్గస్థులైనారు. ఆయన అనుచరులెవ్వరికీ ఆయన లేని లోటు పూరించే స్థాయి, సామర్థ్యం లేవు. పాపకన్ను జయచంద్రారెడ్డి, రాజశేఖర రెడ్డి, రావుల అంకయ్యగౌడ్ వంటివారు తమ తమ గ్రామాలలో పలుకుబడి కల్గిన వారే కాని, మొత్తం నియోజక వర్గంలో ఒక వర్గానికి సారధ్యం వహించే శక్తి యుక్తులు వారికి లేవు.

ఈ లోపం కనిపెట్టి, మాగుంట సుబ్బరామరెడ్డిగారు రాపూరు రాజకీయంలో జోక్యం చేసుకున్నారు. ఆయనకు ఆనం కుటుంబంపై అపరిమిత క్రోధావేశాలున్నాయి. వారి ఆయువు పట్టుమీద దెబ్బకొట్టడానికి రాపూరు కంటె మంచి చోటేముంది? నాయుడు గారు బ్రతికున్నప్పుడే కొమ్మి లక్ష్మయ్యనాయుడు వంటి వారిని చేరదీసి కొంచెం కలకలం చేస్తుండినారు. నువ్వుల మరణంతో ప్రత్యక్ష ప్రమేయానికి వీలు దొరికింది. ఆ ఉద్దేశ్యంతోనే వండ్లూరులో ప్రత్యేకంగా సంతాప సభ పెట్టారు. తమ బలగానంతటినీ అక్కడ కేంద్రీకరించారు. నువ్వుల కుటుంబంపైన రాపూరు నియోజక వర్గంపై హామీలు, వాగ్దానాల వర్షం కురిపించారు. వెంకటరత్నం నాయుడుగారి కుటుంబ ఆర్థిక పరిస్థితిని చక్కదిద్దడానికి తమ సహాయం వుంటుందని; రాపూరు నియోజక వర్గాన్ని తాను దత్తత తీసుకొని అభివృద్ధికి అన్ని విధాలా కృషి చేస్తానని ప్రకటించారు. సభ

### రభస పట్టిన రాపూరు రాజకీయం

తర్వాత కండ్లేరు అతిథి గృహంలో అంతరంగికుల సమావేశం జరిపి, నాయుడుగారి కుటుంబ అప్పు సప్పులను అడిగి తెలుసుకున్నారు. ఆయన కుమారుడు ఎన్.వి.ఎన్.




ప్రసాద్‌ను పిలిపించి ధైర్యం చెప్పారు.

అయితే ప్రక ౖ వున్నట్లుండి పరిస్థితి మారిపోయింది. నాయుడి గారి కుమారుడు తాను తెలుగు దేశంలో చేరుతున్నట్లు ప్రకటించారు. అన్ని ఆశలు కల్పించినప్పటికీ ఆ యువకుడు తప్పుదారిన ఎందుకు నడవ బోయాడన్నది అర్థం కాని విషయం. ప్రసాద్ వెంకటరత్నం నాయుడు కుమారుడనే గాని, రాజకీయాలతో ప్రత్యక్ష సంబంధం వున్న వాడు కాదు. గ్రామ సర్పంచ్ పదవి కేవలం కుటుంబ పరంగా వచ్చింది. అందులోనూ అది చిన్న మునక గ్రామం. తండ్రి మరణం తర్వాత అతడిలో రాజకీయ ఉబలాటం ప్రేరేపించినట్లున్నారు. నల్లపరెడ్డి శ్రీనివాసుల రెడ్డి మరణం తర్వాత ఆ సానుభూతితో ప్రసన్న కుమార రెడ్డి ఎమ్మెల్యేగా గెల్చినట్లు తానూ గెలవచ్చునన్న కోరిక ఆ యువకుడిలో కల్గినట్లుంది. కాంగ్రెస్‌లో వుంటే అదిసాధ్యం కాదని అందరూ భయపెట్టారట. ఆనం వారికి టికెట్ అంటూ ఇస్తే ఒక్క రాపూరులోనే ఇవ్వాలి. అందువల్ల తనకు అవకాశాలు తక్కువ. పైగా తనకు టికెట్ వచ్చినా ఆనం వర్గాన్ని సహకారం అడిగి కలుపుక పోయే పరిణతి లేదు. వారి చేయూతలేకుంటే కాంగ్రెస్ అభ్యర్థిగా గెలవడం అసాధ్యం. అదే తెలుగుదేశం పార్టీలో చేరితే వారికెటూ ఇక్కడ సరైన అభ్యర్థి లేదు కాబట్టి తనకు టికెట్ సులభంగా వస్తుంది. వర్గ, కుల సమీకరణలతో పాటు తెలుగు దేశం గాలి తనను గట్టెక్కిస్తుందని అంచనా వేసినట్లున్నాడు. అనుకున్నదే తడవు చంద్రబాబు నాయుడికి ఫోన్ చేయడం ఆయన సరేననడం, హైదరాబాదుకు రైల్వే టికెట్లు కొనడం చకచకా జరిగిపోయాయి. మాగుంట అనుచరులు కలదెలుసు కునేటప్పటికి పరిస్థితి చేయి దాటిపోయింది. అప్పటికప్పుడు కాని

కొరవ 8 పేజీలో





# ఆత్మగౌరవం తాకట్టు

పృథ్వీ క్షిపణి ప్రయోగం వాయిదా వేసి ఎనభై కోట్ల భారత ప్రజానీకం ఆత్మగౌరవాన్ని అమెరికాకు తాకట్టు పెట్టింది కేంద్ర ప్రభుత్వం. తాత్కాలిక రాజకీయ, ఆర్థిక సమస్యలను ఎదుర్కోలేని పిరికి తనంతో అగ్రరాజ్యపు దురంహకారానికి దాసోహమన్నది భారత ప్రభుత్వం.

పృథ్వీ మిసైల్ తాజా ప్రయోగం ఈ వారాంతంలో జరగవలసి వుంది. ఈ నెల 19 తేది మన ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు అమెరికా అధ్యక్షుడు బిల్‌క్లింటన్‌తో సమావేశం కానున్నారు. అమెరికా అధ్యక్షుడంతటి వాడితో కలసి మాట్లాడ బోతున్నప్పుడు, ఆయన మనసుకు కష్టం కల్గిస్తే ఏమి ప్రమాదం ముంచు కొస్తుందోనని భయపడి నోటి మాటగా పృథ్వీ ప్రయోగం వాయిదా వేయమని శాస్త్రవేత్తలకు హుకుం చేశారు ప్రధాని. ఎక్కడా లిఖిత పూర్వకమైన ఆదేశం లేదు. అందువల్ల తామా మాటే చెప్పలేదని ప్రభుత్వం పార్లమెంట్‌లో బుకాయింపు ప్రకటన చేసింది. కాని పృథ్వీ మాత్రం స్విచ్ ఆన్ కాకుండా ప్రయోగశాలలలోనే వుండి పోయింది.

అగ్ని, పృథ్వీ క్షిపణులు భారత శాస్త్రవేత్తల ప్రతిభకు గీటురాళ్లు. భారత భూభాగాన్ని శత్రు దుర్నిరీక్షణం చేయగల ఆధునిక పాశుపతాస్త్రాలు. మన వంటి పేద దేశం అంతటి శాస్త్ర విజ్ఞాన పరమైన ఆయుధాలు సమకూర్చు కోవడం చూచి ఓర్వలేక అమెరికా చేతనైన అడ్డంకులన్నీ కల్పిస్తూ వస్తున్నది. కాని ఇప్పటి వరకు ఏ నాయకుడూ కూడా వారి వత్తిళ్లకు లొంగలేదు; బెదరింపులకు భయపడలేదు. 1978 లో జిమ్మికార్టర్ ఇండియాకు వచ్చినప్పుడు మొరార్జీ దేశాయ్, 1980లో రీగన్‌ను కలిసినప్పుడు ఇందిరా గాంధీ అత్యంత ధీరోదాత్తంగా భారతదేశ సార్వభౌమాధికారంలో మీరు వేలు పెట్టడం సహించలేమని తెగేసి చెప్పారు. ఆ సాహసం, దేశభక్తి ఇప్పటి నాయకులలో కరువౌతున్నాయి.

పివి నరసింహా రావు గారి అమెరికా పర్యటనలో అణ్వాయుధ వ్యాప్తి నిరోధక ఒప్పందం పై సంతకం చేయించడానికి అమెరికా విశ్వ ప్రయత్నం చేస్తున్నది. అసలీ పర్యటనే అవమానకర తీరులో నిర్ణయమైంది. ఒక ప్రభుత్వాధినేత మరొక దేశం పర్యటించాలంటే కొన్ని సాంప్రదాయాలున్నాయి. ముందుగా రెండు దేశాల అధికారుల స్థాయిలో, మంత్రుల స్థాయిలో సమావేశాలు జరగాలి; అజెండాను చర్చించాలి; ఆహ్వానం మర్యాద పూర్వకంగా రావాలి; ఉభయుల అనుకూల తేదీలు నిర్ణయం కావాలి. పివి విషయంలో అదేమీ జరగలేదు. మే 6 తేది రమ్మని నేరుగా ప్రధానమంత్రి కార్యాలయానికి ఫ్యాక్స్ సందేశం పంపారు. ఏక పక్షంగా తేది చెప్పడమంటే "పిలిపించుకొని మాట్లాడడం" తో సమానం. మరీ పరువు పోతుందని ఆ తేదిని 19 గా మార్చారు పివి.

భారత ప్రధాన మంత్రి అమెరికా పర్యటించే సానుకూల వాతావరణం కూడా ఇప్పుడు లేదు. భారతదేశం పై సూపర్ 301 ఆర్థిక ఆంక్షలు విధిస్తానని అమెరికా బెదరిస్తున్నది; పాకిస్తాన్‌కు అణ్వాయుధాలు మోయగల ఎఫ్ 16 విమానాలను సరఫరా చేసి, ఉపఖండంలో యుద్ధభీతి పెంచుతున్నది; పంజాబ్ కాశ్మీర్ వ్యవహారాలలో అమెరికా అధ్యక్షుడు తీవ్రవాదులను, పాకిస్తాన్ విచ్ఛిన్నకర కార్యకలాపాలను సమర్థిస్తూ బహిరంగ ప్రకటనలు చేస్తున్నాడు; జిఎస్ఎల్‌వి 3 రాకెట్ ప్రయోగానికి అవసరమైన క్రయోజనిక్ ఇంజన్లను రష్యా నుంచి కొనుక్కోవడానికి వీలు లేకుండా అడ్డం వేశారు. ఇన్ని రకాలుగా, ఇన్ని రూపాలలో భారతదే న్ని అవమాని స్తూ, అగౌరవ



ఎరుస్తూ, ప్రగతిని నిరోధిస్తూ, ఇంకొక ప్రక్క మన శత్రుదేశమైన పాకిస్తాన్‌తో శృతి మించిన చెలిమి ప్రదర్శిస్తున్న అమెరికాకు భారత ప్రధాని అంత హడావుడిగా వెళ్లడమే దురదృష్టకర పరిణామం. దానికి తోడు వారు బెదరించారని భయపడి, మనం మన స్వశక్తితో, స్వపరిజ్ఞానంతో తయారు చేసుకొన్న పృథ్వీ క్షిపణి ప్రయోగం వాయిదా వేయించడం ఇంకా అవమానకరం.

మన ప్రధాన మంత్రి దేశ భక్తి లేని వాడని అనడం పొరపాటు అవుతుంది కాని, ఘనతరమైన, ధీరోదాత్తమైన ఈ దేశ చరిత్ర, సంస్కృతి, ప్రతిభలకు దీటైన సాహసత్వం ఆయనలో కొరవడు తున్నదనే భావించాలి. ఆ పిరికి తనమే తరచు దేశ ప్రతిష్టను అగ్ర రాజ్యాలకు, వారి జేబులో వుండే ఐఎంఎఫ్, ప్రపంచ బ్యాంకు వంటి ఆర్థిక సంస్థలకు తాకట్టు పెట్టడానికి కారణమౌ తున్నది. ప్రధాని పివి ఇప్పటికైనా తన నిర్ణయం మార్చుకొని పృథ్వీ ప్రయోగం యథా ప్రకారం జరిపేట్లు ఆదేశించాలి; అమెరికాలో, ఆ దేశాధ్యక్షుడితో స్వతంత్రించి, స్వయం నిర్ణయాలు తీసుకోకుండా తాను చేసే ప్రతి సంతకమూ భారత పార్లమెంట్‌లో చర్చ జరిపి, ఆమోదం పొందితేనే ఆచరణకు వచ్చేటట్లు ఏర్పాటు చేయాలి. ప్రజాభిమానానికి విరుద్ధంగా, దేశ ప్రతిష్టకు భంగకరంగా ఏ నిర్ణయం తీసుకున్నా పివి నరసింహా రావు చరిత్ర దృష్టిలో దోషిగా నిలబడుతారు.

# నెల్లూరు టౌన్ బస్సులు నరకలోక శకటాలు!

టౌన్ బస్సుల్లో మహిళలు పడరాని పాట్లు పడుతున్నారు. ఆర్టీసి బస్సుల్లో సైతం ఆడవారికి కేటాయించిన సీట్లలో మగవారు కూర్చొని వుంటారు. ఆడవారు నిలబడి ఇబ్బంది పడుతున్నా ఎవరూ సీట్లలోంచి లేవరు. కనీసం కండక్టర్లయినా వాళ్లను లేపరు. ప్రక్క రాష్ట్రమైన మద్రాసులో మహిళలకు లభించే గౌరవం ఆంధ్ర రాష్ట్రంలో లభించడం లేదు. నాయకులు మహిళా మణులంటూ వుపన్యాసాలు చేస్తారు తప్ప వాళ్లకు కనీస సౌకర్యాలు కల్పించిన పాపాన పోరు. ఇక ప్రైవేట్ బస్సుల్లో ప్రయాణించడం కన్నా, నరకలోక యాత్ర చేసి రావడం బెటరు. క్రిక్కిరిసి వుండే బస్సును సైతం 15 నిమిషాలపాటు స్టేజీల్లో ఆపేస్తారు. వెనుక బస్సు రాగానే ఒక్కసారిగా ముందుకు వురికిస్తారు. నిలబడి వున్న మహిళల పరిస్థితి ఆ సమయంలో దారుణం. కండక్టర్, డ్రైవర్, క్లీనర్ల అసభ్య పదజాలాలు వినలేం. టౌన్‌కు హార్టువంటి ట్రంకురోడ్డులోకి టౌన్ బస్సులు రావు.

వాటికోసం విజయ మహల్ గేటు వరకు చేతుల్లో వున్న భారాన్ని మోసుకొని పోవాలంటే దేవుడు గుర్తుకు వస్తున్నాడు. ఫుట్ బోర్డు మీద మహిళలు దిగను కూడా వీలు లేకుండా నిలబడే వారిపైన, ఓవర్ లోడ్ చేసేవారిపైనా, మహిళల సీట్లు కేటాయింపు విషయంలోనూ ఇటు పోలీస్ శాఖ - అటు రవాణాశాఖ అధికారులు విఫలమయ్యారు. మరి మహిళల పాట్లు సరిదిద్దే అధికారే లేరా?

నెల్లూరు - బి.శివప్రియ



జనవాణి

## ప్రజలు మారితేగాని పరిస్థితులు మారవు

గత రెండు వారాలుగా మీరు సింగపూరు పర్యటన గూర్చి వ్రాసిన వ్యాసంలో అక్కడి ప్రజల క్రమశిక్షణ, పరిశుభ్రత గూర్చి చక్కగా చెప్పారు. అది చదివాక మనవారు ఎంత వెనుకబడి వున్నారో చెప్పాలని ఇది వ్రాస్తున్నాను. ప్రజలలో మార్పు రానంతవరకూ ఏ ప్రభుత్వ మైనా, ఏ 'యిజం' అయినా చేసేదేమీ లేదు. ఉదాహరణకు టౌన్‌లోని మా హౌసింగ్ బోర్డ్ కాలనీనే తీసుకొందాం. ఇక్కడ 200 ఇళ్లు వుంటాయి. చెత్త పోయను మునిసిపాలిటీ వారు తొట్లు పెట్టారు. కానీ వాటిని ఎవరూ ఉపయోగించరు. చెత్తను మొత్తం రోడ్లపై దిబ్బలుగా పోస్తారు. కాని ఒక అడుగు ముందుకేసి తొట్లలో పోయరు. రోడ్లపై పోసిన చెత్త గాలికి రోడ్డంతా పరచుకొని వుంటుంది. ఈ కాలనీవారు చదువు విజ్ఞానం లేనివారు కాదు. ముప్పాతిక భాగం వుద్యోగాలు చేసేవారే. అదేవిధంగా పార్కులో మున్సిపాలిటీ పెంచిన చెట్లనూ నరికివేశారు. గ్రంథాలయ భవన కిటికీలు, అద్దాలు పగులగొట్టారు. ఈ సంఘటనలన్నీ ప్రజలు ఏమాత్రం సామాజిక బాధ్యతలు లేకుండా ప్రవర్తిస్తున్నారని, ఒక కాలనీని వుదహరించి చెబుతున్నాను. కాలనీనే ఇలా వుంటే గ్రామాలు, టౌన్లు, కార్పొరేషన్ల పరిస్థితి ఏమిటి? ఇక దేశం సింగపూర్‌లా ఏ విధంగా అభివృద్ధి సాధిస్తుంది?

నెల్లూరు - తిరుమూరు నరసింహారెడ్డి

కొరవ 8 పేజీలో

12-5- 1944

పేజీలు : 6 వెల : 0-1-6

## "స్వతంత్ర భారత్‌లో స్వేచ్ఛా వాయువు పీల్చనిదే చావను"

### సర్వాంగ సుందరి స్వరాజ్యలక్ష్మిని కన్నులారా గాంచియే తీరుతాడట

మహాత్ముని మనో నిశ్చయం

విఖ్యాత మహారాష్ట్ర ఆయుర్వేద వైద్యులు శ్రీ భడ్కాంకర్ గారితో గాంధీజీ మొన్న బుధవారం నాడు తన మనో నిశ్చయాన్ని గురించి ఈ విధంగా తెలియజేశాడు.

" స్వతంత్ర భారతావనిలో స్వేచ్ఛా వాయువులు పీల్చి, స్వరాజ్య లక్ష్మిని కనుల పండువుగా గాంచనిదే

జమీన్‌రైతు

ప్రాణం విడదలచుకోలేదు"

" ఆయుస్సు మరో 25 సంవత్సరాలు అభివృద్ధి పరచే మందు ఏదైనా మీవద్ద వున్నదా ? వుంటే యివ్వండి " అని డాక్టరు గార్ని అడిగాడు బాపూజీ.

పండిత మాలవ్యా "శతాయుష్యం" అని దీవిస్తూ టెలిగ్రాం పంపితే మహాత్ముడు తిరుగబడ్డాడు. " నేను 125 సంవత్సరాలు బ్రతుకుతా. నూరేళ్లు గాదు" అని జవాబు యిచ్చి " నా జీవితంలో మీరు తగ్గించిన ఆ పాతికేండ్లు మీరు ట్రాన్స్‌ఫర్ చేసుకోండి " అని మాలవ్యాను బదులు దీవించాడు!

పత్రికా విలేఖరులు రోజు రోజు అధికంగా పర్ణకుటికి వస్తున్నారు. కాని కార్యదర్శి ప్యారీలాల్ వారికి ఇలా చెప్పాడు. " మహాత్ముడు చావడు. ఆయన బ్రతికి తీరుతాడు. ఆయన్ను విశ్రాంతి తీసుకోనియ్యండి".

### గాంధీజీకి కొరడా దెబ్బ

గాంధీ మహాత్ముని విడుదల వార్త విన్నంతనే హైదరాబాదు నుంచి సరోజినీ దేవి వచ్చి-

" మా పాపను మళ్లీ పెంచటానికి నాకు యిదో అవకాశం చిక్కింది"

అంటూ, మహాత్ముని దగ్గర వాలింది.

**50 ఏళ్ళ క్రితం ఈవారం**

సరోజినీ నాయుడుగారు వచ్చినప్పటి నుంచి "తన పాప" ను అమితమైన జాగ్రత్తతో కాపాడుతూ పోషించుకుంటూన్నది. గాంధీజీతో రాజకీయాలు, యుద్ధ వాషాలు చర్చించుతూండగా ఒక పెద్దాయన్ను ఆమె బయటకు పంపినందుకు మహాత్ముడు కోపాన్ని కనబరచాడు.

• చెప్పనియ్యండి అన్ని విషయాలు తెలుసుకోవాలి. ఒక వేళ చచ్చి పోయేట్లయినా, అన్ని విషయాలు తెలుసుకొని మరీ చావాలి" అన్నాడు.

దానికి సరోజినీ నాయుడుగారు ఏమీ తోణకక యిలా సమాధానం చెప్పింది "నీవంటే నాకేమి భయమనుకున్నావా?

కొరవ 8 పేజీలో

# ఎనభై ఏళ్లయినా ఎవరికీ రాలేదు నోబుల్ బహుమతి!

వర్తమాన సమాజం యాజమాన్యాన విశ్వకవి రవీంద్రనాథ టాగూరు 137 జయంతి సభ టాగూరు సాహిత్యాభిమాని డాక్టర్ బెజవాడ గోపాల్ రెడ్డి అధ్యక్షతన జరిగింది. ఈసారి టాగూరు స్మృత్యంక అవార్డును న్యాయవాది మాడభూషి సుందరాచారి అందుకున్నారు. సభా దీపకులు వర్తమాన సమాజ అధ్యక్షులు శ్రీ పి.వి. రమణారెడ్డి వేదిక నలంకరించారు. సమాజ ఉపాధ్యక్షులు అగస్త్యరెడ్డి వెంకురెడ్డి మాట్లాడుతూ రవీంద్ర జయంతి సభలు మూడు దశాబ్దాలుగా జరుపుతున్నారని, రమణారెడ్డిగారు వారి తల్లి స్మృత్యంకంగా ట్రస్టును ఏర్పాటు చేసి వుపన్యాసకునికి ప్రతి యేటా వెయ్యిరూపాయలు అవార్డు ఇచ్చేట్లు నిర్ణయించినట్లు చెప్పారు.

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షోపన్యాసం చేస్తూ ఈరోజు బంగ్లాదేశ్‌లో కూడా టాగూరు జయంతి జరుపు కుంటున్నారు. 1913 లో టాగూరుకు సాహిత్యంలో నోబెల్ బహుమతి లభించింది. నాటి నుంచి 81 సంవత్సరాలు గడిచినా మరే భారతీయునికి సాహిత్యంలో నోబెల్ బహుమతి రాని విషయాన్ని గుర్తుకు తెచ్చారాయన. టాగూరు సాహిత్యవేత్తకారు. సంగీత విద్వాంసుడు; మూడు వేల పాటలు వ్రాశారు. ఆయన సాహిత్యంకంటె

## రవీంద్రుని జయంతి

సంగీతాన్నే తాను ఇష్టపడేవాడినని బెగోర తన మనసులోని మాటను చెప్పారు. ఆయన పొందినన్ని సన్మానాలు మరెవరూ పొందలేదని చెబుతూ ఆఫ్రికా, వర్ణవివక్షతపై అనాడే టాగూరు కవితలు వ్రాసినట్లు చెప్పారు.

టాగూరు అవార్డు గ్రహీత మాడభూషిసుందరాచారి రవీంద్రుడు కవి, దార్శనికుడు, తాత్వికుడు, అగ్రశ్రేణి చిత్రకారుడు, సంగీతకారుడు, నవలాకారుడు, దేశభక్తుడు, బహుముఖ ప్రజ్ఞాధురీణుడని అభివర్ణించారు. 1937 లో కలకత్తా విశ్వవిద్యాలయం స్నాతకోత్సవ సభలో వంగభాషలోనే వుపన్యాసమిచ్చిన జాతీయ అభిమాని అని చెప్పారు. ఆయిన అస్వస్థుడుగా వుండగానే 'గీతాంజలి'ని ఆంగ్లంలోకి అనువదించారని, ఒకసారి ఇంగ్లాండు వెళ్లి అక్కడ ఆంగ్ల కవుల సమావేశంలో ఆ కృతిని చదివి వినిపించగా వారు ముగ్ధులైనట్లు చెప్పారాయన. కచదేవయాని, చిత్రాంగద, ప్రకృతి, విసర్జన మొదలగు నవలికల్లోని లక్షణాలను సుందరాచారి గారు కూలంకషంగా వివరించారు. సభలో కె. పురుషోత్తమరావు రవీంద్రుని పాటను బెంగాలీ భాషలో పాడి సభకు మరింత వన్నె తెచ్చారు. వర్తమాన సమాజం కార్యదర్శి బి. వి. నరసింహం వందన సమర్పణతో సభ ముగిసింది.

## సణుగుడు

### * ఎన్నికల లోపల ఎన్ని మార్పులొస్తాయో!

శాసన సభ ఎన్నికలు దగ్గర పడే కొద్దీ జిల్లాలో కాంగ్రెస్ రాజకీయం చిత్ర విచిత్రాలుగా మారి పోతూంది. ఊసర వెల్లివలె రంగులు మారుస్తూంది. ఎన్నికల నాటికి ఇంకెన్ని మెలికలు పడుతుందో, ఎన్ని రూపాలు సంతరించు కుంటుందో వూహించ లేము.

జిల్లా స్థాయిలో జనార్దనరెడ్డికి ఈ నాటికి ఎదురు లేదు; రేపటికి వుండదానికి వీలు లేదు. జిల్లాలో మరెవ్వరికీ అందనంత స్థాయికి ఎదిగిపోయారు జనార్ధనరెడ్డి. ఆ స్థాయి వేరు కోవాలని ఎవరూ ప్రయత్నించడం లేదు కూడా; అందువల్ల లోపల ఎట్లున్నా పైకి మాత్రం అందరూ జనార్దన విధేయులే!

నియోజక వర్గాల స్థాయిలో మాత్రం ఎవరికి వారు పరుగు పందెం కాస్తున్నారు. గత నాలుగు ఎన్నికల అనుభవాలు చూస్తే ఇప్పుడూ 11 టికెట్లు జనార్ధనరెడ్డిగారే భద్రంగా జేబులో పెట్టుకొని ఢిల్లీ విమానం దిగుతారని భావించాలి. అది తెలిసి, సుబ్బానైనా అని వాదులాడు కోవడం, ఆశలు పడడం వ్యర్థం. కాని పదవీ లాలసత్వం అనేది మానసిక దుర్గతి; వళ్లు వుండ్లు పడుతున్నా గిరి కొద్దీ మరింత గీరుకోవాలన్పించే తామర వంటి వ్యాధి. ఆఖరు క్షణం వరకు పదవికోసం ప్రాకులాడడం రాజకీయ వ్యాధి లక్షణం కదా!

మాగుంట సుబ్బరామిరెడ్డి,

### డోలేంద్ర

నెల్లూరు రామచంద్రారెడ్డి ద్వయం స్వతంత్రించి కొందరికైనా టికెట్లు ఇప్పించ గలరనే ఆశ కొట్టుకు లాడుతున్నది అక్కడక్కడ! కాంగ్రెస్ పార్టీలో కలకలానికి కారణం అదే! అయితే మాగుంట సుబ్బరామిరెడ్డి గారు ఇప్పటి వరకు జనార్ధనరెడ్డిని వ్యతిరేకించి పోయిన దాఖలా లేదు.

తరువాయి 6 పేజీలో

# దేశ క్రీడాపటంలో నెల్లూరుకు చోటిచ్చింది రవిదేవరెడ్డి!

నక్సలైట్ల చేతిలో హతుడైన వ్యాయామ ఉపాధ్యాయుడు రవిదేవరెడ్డి సంతాప సభ 9తేది టౌన్ హాల్‌లో జరిగింది. వి. ఆర్ కళాశాల కరస్పాండెంట్ ఆనం వివేకానందరెడ్డి సభకు అధ్యక్షత వహించారు. రవిదేవరెడ్డి చిత్రపటాన్ని ఆవిష్కరించిన అనంతరం మాజీ మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి మాట్లాడారు. నెల్లూరు క్రీడారంగాన్ని దేశ చిత్ర పటంలో ముద్రించేందుకు రవిదేవరెడ్డి ఎనలేని కృషి చేశారు. దానివల్లే జాతీయ, రాష్ట్ర స్థాయి క్రీడల్లో జిల్లాకు ప్రాతినిధ్యం లభించింది. ఈ విషయాన్ని జిల్లా క్రీడాకారులు నిత్యం మననం చేసుకుంటూ పై స్థాయికి ఎదగాలన్నారాయన. జూన్‌లో జరిగే ఉపాధ్యాయుల రాష్ట్ర ఎగ్జిక్యూటివ్ సమావేశంలో ఆయన పేరుతో రాష్ట్ర స్థాయి క్రీడల పోటీలు నిర్వహించ నున్నట్లు చెప్పారు. ఏసి సుబ్బారెడ్డి స్టేడియంలో రవిదేవరెడ్డి పేరుతో జిల్లా స్థాయిలో కబాడీ పోటీలు త్వరలో నిర్వహించ నున్నట్లు తెలిపారు. తెలుగు దేశం నాయకుడు పోపిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి మాట్లాడుతూ ప్రజల మద్దతుతో పుద్యమాలు నిర్వహించ వలసిన నక్సలైట్లు ప్రక్కదారి త్రొక్కుతున్నట్లు [illegible]

వ్యక్తంచేశారు. ఫిజికల్ ఎడ్యుకేషన్ స్కూల్స్ ఇన్‌స్పెక్టర్ రామకృష్ణారెడ్డి, పి.ఇ.టీల జిల్లా సంఘ ఉపాధ్యక్షుడు కె. ఈశ్వరరెడ్డి తదితరులు సభలో మాట్లాడారు.

## నెల్లూరు సంగతులు

### కెమిస్ట్, డ్రగ్గిస్ట్ అసోసియేషన్ భవనం

1970లో రిజిష్టరై అయ్యి పని ప్రారంభించిన నెల్లూరు జిల్లా కెమిస్ట్, డ్రగ్గిస్ట్ అసోసియేషన్ దిన దిన ప్రవర్ధమాన మయ్యింది. తమ వ్యాపారాలకే పరిమితం కాకుండా అవసరమైన సమయాల్లో మేమున్నామంటూ ప్రజలకు అండగా కూడా నిలచింది అసోసియేషన్. 8తేది అసోసియేషన్ స్వంతంగా నిర్మించుకున్న భవనాన్ని రాష్ట్ర డ్రగ్ కంట్రోలర్ ఎం. సూర్యనారాయణమూర్తి ప్రారంభించారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకుని రాఘవ కళ్యాణమండపంలో అసోసియేషన్ అధ్యక్షులు ఎవి సుబ్బరామయ్య అధ్యక్షతన సభ జరిగింది. ఫార్మసి కౌన్సిల్ ఆఫ్ ఇండియా ఉపాధ్యక్షులు సిక్ కోకాటె ప్రసంగిస్తూ డిఫార్మసి కాలేజి స్థాపనకు అవసరమైన సహాయ సహకారాలు అందిస్తానన్నారు. ఎమ్మెల్యే జకారెడ్డి సంస్థ చేస్తున్న ప్రజా సంక్షేమ కార్యక్రమాలను ప్రస్తుతించారు. అసోసియేషన్ భవన ప్రారంభ శుభ సమయాన ఎమర్జెన్సీమెడికల్ కిట్‌ను

తరువాయి 6 పేజీలో.

# నెల్లూరు నలుచెరగుల్లో
## విమర్శకుడు

### మండే ఎండలు

ఎండలకు హద్దు పగుల్తాయా లేదే కాని. గతవారం నుంచి నెల్లూరులో సూర్య ప్రతాపానికి శిరాలు మాత్రం ఉడికి పోతున్నాయి. పగటి పూట తల బైట పెట్టాలంటే, నిప్పుల కొలిమిలో వున్నట్లుంది. దీనికి తోడు వడవడి గాలి వడగాడ్పులు. నీళ్ల తొట్టెలో నిద్రించాల్సి నట్లుంది పరిస్థితి. మండే ఎండలకు తోడు కరెంట్ కోత. దానికి వేళాపాళా రెండూ లేవు. ఎప్పుడు వస్తుందో తెలియదు. ఎప్పుడు పోతుందో తెలియదు. పెరిగే ఉక్కపోత తోడై జనం మలమల మాడి పోతున్నారు. ఇంకెంత కాలమో ఈ మండే పరిస్థితి శిక్ష మనకు.

ఈ వారంలో నెల్లూరులో రికార్డయిన ఉష్ణోగ్రత వివరాలివి

| | |
|---|---|
| 6 తేది (శుక్రవారం) | 106.3 |
| 7 తేది (శనివారం) | 107.2 |
| 8 తేది (ఆదివారం) | 111.2 |
| 9 తేది (సోమవారం) | 108.6 |
| 10 తేది (మంగళ వారం) | 108.8 |
| 11 తేది (బుధవారం) | 108.1 |
| 12 తేది (గురువారం) | 110.6 |

### నెల్లూరుకు రాజీవ్ జ్యోతి

రాష్ట్రపతి సభ్యులు అధ్యాపకులు ఢిల్లీ నుండి శ్రీపెరుంబుదూరు తీసుకొస్తున్న రాజీవ్ జ్యోతి 19 తేది రాత్రి 8 గంటలకు నెల్లూరు చేరుతుంది. ఈ సందర్భంగా ఇందిరా భవన్‌లో జరిగే సభలో మాజీ ముఖ్యమంత్రి ఎన్. జనార్దన రెడ్డి కూడా పాల్గొంటారు. ● జ్యోతి 20 తేది వుదయం గూడూరు, నాయుడు పేట, పుత్తూరుల మీదుగా శ్రీపెరుంబుదూరు సాగిపోతుందని డిసిసి అధ్యక్షులు శ్రీ ఆనం సంజీవ రెడ్డి తెలియ చేస్తున్నారు.

### జనార్దన రెడ్డి

రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు, మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి 17 తేది మద్రాసు మీదుగా నెల్లూరు వస్తున్నారు. ఉదయం 10.30 గంటలకు భీముని వారి పాళెంలో జరిగే దీపుల ప్రజల కోసర్యార్థం కొన్ని బోటుకు ప్రారంభోత్సవం; తర ఇందిరాగిలో చెక్ డ్యాముకు శంకుస్థాపన; శ్రీధనమల్లిలో స్కూలు భవనం ఓపెనింగ్, జనన్ని పెంచలయ్య కార్యక్రమాలు. రాత్రికి మకాం వాకాడు. 18 తేది ఉదయం వాకాడు బస్ డిపోకు రిబ్బను కత్తిరింపు; వెంకటగిరిలో పొదుపు లక్ష్మి వర్క్‌షాప్; బైరవరంలో మామిడి కాలువ కాలవకి శంకుస్థాపన; గోనేటి వారి రాజాపాళెంలో స్వర్ణముఖి కాలవకి ప్రారంభోత్సవం; రాత్రికి వాకాడు.

19 తేది ఉదయం జమీన్ కొత్త పాళెం, చిట్టేడు, శేశవరం గ్రామాల్లో కార్యక్రమాలు; 20 తేది వెంకటగిరి, గొల్లపల్లి, తిప్పవరప్పాడు గ్రామాలు. 21 తేది నెల్లూరు టౌన్‌లో రాజీవ్ వర్ధంతి సభలు. తిరుగు ప్రయాణం ఇంకా నిర్ణయం కాలేదు.

### యానాది రెడ్డి

దేవుళ్ల మంత్రి శ్రీ కలిగి యానాది రెడ్డి 9 తేది కావలికి వచ్చారు; ఈ రోజు (12 తేది) విశాఖ పట్నం వెళ్తున్నారు; తిరిగి 15 తేది కావలికి వస్తారు. ఎప్పుడు వెళ్లేది తెలియదు.

### రాజీవ్ వర్ధంతి- ఆటలు, వ్యాసరచన పోటీలు

స్వర్గీయ ప్రధాని రాజీవ్ గాంధీ వర్ధంతి సభ 21 తేది ఇందిరా భవన్‌లో జరుగుతుంది.

శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి తన ఎమ్మెల్యే జీతం, పెన్షన్ల సొమ్ముతో ఏర్పర్చిన ట్రస్టు నిధుల నుంచి ఈ కార్యక్రమం జరిపించాలని తలపెట్టారు. ఈ సందర్భంగా పిల్లలు, యువకులకు ఆటల పోటీలు, వ్యాస రచన, వక్తృత్వ పోటీలు నిర్వహిస్తారు. డిసిసి అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవ రెడ్డి దగ్గరుండి ఏర్పాట్లు చూస్తారు. పోటీలలో పాల్గొన దలచిన వారు ఇందిరా భవన్‌లో అడిగి వివరాలు తెలుసు కోవచ్చు.

### సర్వోదయ ఎన్నికలు

సర్వోదయ కాలేజి కమిటీకి 6 తేది ఎన్నికలు జరిగాయి. శ్రీ కోట సుబ్రహ్మణ్యం కాలేజి సెక్రటరీ, కరస్పాండెంట్‌గా ఎంపికైనారు. శ్రీ చిరిళ్ల వెంకటేశ్వర్లు జాయింట్ కార్యదర్శిగా ఎన్నికైనారు. పాత కమిటీలోని అధ్యక్షుడు శ్రీ అయితా ఆనంద కృష్ణయ్య, కోశాధికారి శ్రీ పివి సుబ్రహ్మణ్యం, ఉపాధ్యక్షుడు శ్రీ పాదర్తి ముత్యాలు శెట్టిలను అదే పదవుల్లో కొన సాగించేటట్లు తీర్మానించారు.

### రంగడి గుడిలో పుష్ప పల్లకి

నెల్లూరు శ్రీ తల్పగిరి రంగనాథ స్వామి దేవాలయంలో 5 తేది నుంచి శ్రీ భగవద్రామానుజాచార్యుల వారి జయంత్యుత్సవాలు శాస్త్రోక్తంగా జరుగుతున్నాయి. వైష్ణవ సాంప్రదాయంలో అత్యంత ప్రాశస్త్యం కలిగిన ఈ ఉత్సవాలను జరుపుతున్న దేవాలయం ఆంధ్ర దేశంలో రంగడి గుడి ఒక్కటే. చివరి రోజు - 14 తేది సాయంత్రం 32 అడుగుల పొడవు, దాదాపు 60 మంది మోతగాళ్లు కలిస్తే తప్ప మొయ్యలేనంత బరువు కల్గిన పుష్పపల్లకి వూరేగింపు వుంటుంది. మద్రాసు, బెంగుళూరుల నుంచి ప్రత్యేకంగా తెప్పించే రంగు రంగుల పుష్పాలతో పల్లకిని అలంకరిస్తారు. కనుల పండుగగా వుంటుందా దృశ్యం. మాగుంట సుబ్బరామ రెడ్డి గారి తనయుడు శ్రీ విజయ్ బాబు అర్చకులు, పరిచారకుల కంటే ఎక్కువగా కష్టపడి పల్లకి తయారు చేయిస్తున్నారు. ఖర్చంతా వారిదే - లక్ష దాటుతుంది. భక్తులు వేలంగా తరలి రావాలని ధర్మకర్తల మండలి విజ్ఞప్తి చేస్తున్నది.

### బాటిల్లో బొద్దింక- నాన్ వెజ్ థమ్స్ అప్?

డబుల్ కోలాలు, మినీ కోలాల వంటివి ప్రజలను ఆకర్షించడానికి పనికి రావటం లేదని కాబోలు "నెల్లూరు గోల్డ్‌స్పాట్ కంపెనీ వారు సరికొత్త ధోరణిలో నాన్ వెజిటేరియన్ థమ్స్ అప్ కనిపెట్టారు. చల్లదనం కోసం త్రాగే డ్రింక్‌లో ఉచితంగా బలవర్ధక ఆహారం సరఫరా చేయడం మహదానంద పడవలసిన ఉపకారం కదా! అందులోనూ వండిన పదార్థాలు కాకుండా సజీవ క్రిమి కీటకాదులైతే మరింత ధాతుపుష్టి అయుర్వృద్ధి!

నాలుగు రోజుల క్రితం ఈ డబుల్ బెనిఫిట్ కూల్‌డ్రింక్ సీసాను సందర్శించే భాగ్యం మా రిపోర్టర్‌కి లభించింది. చిక్కటి, నల్లటి థమ్సుఅప్ కోలా ద్రవంలో బహు చక్కటి బొద్దింక ఒకటి ముచ్చట గొల్పుతూ, మురిపిస్తూ దర్శన మిచ్చింది. పాపం దాన్ని చూడగానే రెండు కిలోల మాంసం పలావునువును సైతం అలాగ్గా అరగించుకొనే ఆ కార్మి కూడా కొక్కనేంత పని చేసి, ఆ సీసాను భద్రంగా ఆఫీసుకు తెచ్చారు. బొద్దింకల బాధ పడలేక, వాటిని చంపడం అలివి కాక, అవస్థలు పడే గృహిణులు తమ తమ ఇళ్లలోని బొద్దింక లన్నింటినీ భద్రంగా ప్యాక్ చేసి, థమ్స్ అప్ కంపెనీకి అమ్మి, సైడ్ ఇన్ కం సంపాదించు కోవచ్చునేమో, పరిశీలించండి!

కల్తీసారా చావుల వలె, కల్తీ కూల్ డ్రింక్‌ల మరణాలు సంభవించక ముందే ఈ పొరపాట్లు సరిదిద్దు కోండి!

### బుజబుజ నెల్లూరులో అగ్ని ప్రమాదం

సూర్యుడికి నెచ్చెలిగా అగ్ని

కొరవ 6 వ పేజిలో

## నెల్లూరు సంగతులు

(4 పేజీ కొరవ)

కలెక్టర్ కి సాంఘిక...వుకు రెవ్ గ్రాంట్ సంస్థ కిష్టమనిఅందజేసింది. ఈ కిడిలో యూక్సిడెంట్లు జరిగినప్పుడు అవసరమయ్యే బి.వి. ఫ్లూయిడ్లు బ్యాండేజిస్ పెయిన్ రిలీవర్లు ఇంజక్షన్లు పంపిణీ చేస్తుంటాయి. ద్రగ్ కంట్రోల్ అసిస్టెంట్ డైరెక్టర్ యం. సూర్యనారాయణ మూర్తి, విజయవాడ రీజియన్ డ్రగ్ కంట్రోలర్ పి. భాస్కరరావు, డ్రగ్ ఇన్స్పెక్టర్ అరవింద కుమార్ రెడ్డి మాట్లాడారు. బిల్డింగ్ను దగ్గరుండి కట్టించిన సంఘ సభ్యుడు పిసి రత్నం ను సన్మానించారు. అసోసియేషన్ కార్యదర్శి జితేంద్ర నాథ్ రెడ్డి వందన సమర్పణతో ముగిసిన కార్యక్రమానికి బయోటెక్స్ డైరెక్టర్ సివి నారాయణరావు వ్యాఖ్యాతగా వ్యవహరించారు.

జిడి ప్రసాద్, వి.ఎస్. యూసఫ్ పాల్గొన్నారు. వీరితోపాటు ఎం.పి. బందారు రత్నాకర్, మాజీ మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, ఎమ్మెల్యే కాకాని విష్ణువర్ధన రెడ్డి సంఘం రిజిస్ట్రార్ సెక్రెటరీ వివి సత్యనారాయణ చెప్పారు. సరసన్న రిసెప్షన్ కమిటీకి ఆనం వివేకానంద రెడ్డి ఛైర్మన్.

### బెగోర స్మృతులలో ఘంటసాల!

మధుర గాయకుడు ఘంటసాల స్మృతులలోకి సాహితీవేత్త బెజవాడ గోపాలరెడ్డి గారు వెళ్లిపోయారు. 6 తేది టౌన్‌హాల్‌లో ఘంటసాల 20 వర్ధంతిని పురస్కరించుకుని జరిగింది సంఘటన. జైలులో ఒకసారి తనతోఘంటసాల సహాధ్యాయిగా వున్నట్లు చెప్పారాయన. సంగీత కళామతల్లికి అమర గాయకుడు చేసిన సేవలు వెలగట్ట లేనివని. అందుకే ఆయన సుప్రసిద్ధుడు, చిరస్మరణీయుడైనాడని వెల్లడించారు. అనంతరం సంగీత విభావరి నిర్వహించను గుంటూరు నుండి వచ్చిన ఎస్. - ముక్కామలను గోపాలరెడ్డి తన చేతుల మీదుగా సన్మానించారు. మాజీ శాసన సభ్యుడు చెన్నారెడ్డి, పెంచెలురెడ్డి, వామ్మన సుబ్రహ్మణ్యం, కొండా బలరామిరెడ్డి తదితరులు వేదికపై ఆశీనులయ్యారు. ఘంటసాల అభిమానులు శ్రీ కోటేశ్వరరావు, మయూరి ఫిలిప్స్ అసిస్టెంట్ మేనేజర్ యు. ప్రతాప్ ఈ కార్యక్రమం ఏర్పాటు చేశారు.

### తపాలా ఉద్యోగుల సదస్సు

భారతీయ పోస్టల్ ఎంప్లాయిస్ యూనియన్ ఎక్స్ట్రా డిపార్టుమెంట్ పోస్టుమెన్లు, క్లాస్ మూడు, నాలుగు ఉద్యోగుల రాష్ట్ర వ్యాపిత సదస్సు జూన్ 5,6 తేదీల్లో నెల్లూరు టౌన్‌హాల్‌లో జరుగనున్నది. పెండింగులోబడి పరిష్కారం కాని సమస్యలతోపాటు ఐది పే కమీషన్ ముందు ప్రతిపాదించవలసిన డిమాండ్లను ఈ జనసందేశ్ సదస్సులో చర్చిస్తారట. సదస్సులో జాతీయ ఉద్యోగుల సంఘం నాయకులు నారాయణ మహాపాత్ర,

### నెల్లూరు ముచ్చట్లు

(5 పేజీ కొరవ)

దేముడా స్వైర విహారం చేస్తున్నాడు. ఈ వారంలో బుజ బుజ నెల్లూరులో పెద్ద అగ్ని ప్రమాదం. 10 తేది ఉదయం ఒక గృహిణి వంట చేస్తుండగా నిప్పురవ్వ ఎగిరి గుడిసె అంటుకున్నదట. ఫైరింజన్ వచ్చేలోగా 18 ఇళ్లు తగల బడి పోయాయి.

అర్పని మట్టి. బిడి *గరెట్లు కొంపలను కాలుస్తాయి; *గ్రత్తగా వుండడం అవసరం.

### నెల్లూరు బజారు

మొలగొలుకులు

| | |
|---|---|
| 9674 (కొత్తవి) | 3,800/- |
| 9672 (కొత్తవి) | 3,500/- |
| ఐ.ఆర్. 20 | 2,600/- |
| ఐ.ఆర్. 64 | 2,800/- |
| 5656 (పాతవి) | 2,700/- |
| బియ్యం బస్తా (70 కేజీలు) | 630/- |
| బంగారు సవర (8 గ్రా) | 3,600/ |
| వెండి (10 గ్రా) | 72.50/- |

### పెండ్లిండ్లు

(2 వ పేజి కొరవ)

పాంప్లెట్లు ప్రింట్ వేసి అలవాటై పోయిందేమో- పెండ్లిపత్రిక కూడా పంచ రంగులలో, బ్రోచర్ వలె ముద్రించి కళ్లు చెదరగొట్టాడు గురూజీ. ఆ పత్రిక ప్రింటింగ్ కైన ఖర్చులో ఒక మధ్య తరగతి కుటుంబీకుడి పెండ్లి జరిగిపోతుంది.

* * *

నెల్లూరు గ్రంథాలయ సంస్థ ఉద్యోగి ఆత్మకూరు అంకయ్య నాయుడు కుమారుడు మధు, రామలింగా పురం వాసి కురపాటి రమణయ్య కుమార్తె పద్మజ వివాహం 24 తేది టౌన్‌హాల్‌లో జరిగింది.

కోట, * * శ్రీ పారంగం విజయభాస్కర్ మేనల్లుడు, స్వర్గీయ కానాతి రాధాకృష్ణయ్య కుమారుడు, వాకాడు పంచాయితీ రాజ్ ఎఇఇ చైతన్య కుమార్; నెల్లూరు శ్రీ శీలం అంజనేయులు కుమార్తె అనూరాధ వివాహం 24 తేది నెల్లూరు టిటిడిలో జరిగింది.

### సణుగుడు

(తిరువ పేజి కొరవ)

వారిద్దరి చెలిమి పచ్చగానే వుంది. ఈనాటికీ జనార్దన రెడ్డి నెల్లూరు ప్రోగ్రాములను మాగుంట వారే స్పాన్సర్ చేస్తున్నారు. వారి కారులోనే ఆయన తిరుగుతున్నారు. జనార్దనరెడ్డి గారి హోదాకు సరిపడా బెంజ్ సరఫరా చేయగల శ్రీమంత జిల్లాలో మరెవ్వరికీ లేదు కదా! ఆయన బెంజ్ తప్ప మరొక కారెక్కరం మానుకున్నారు. వారిద్దరి మధ్య ఎడబాటు లేరనడానికి అదొక గొంత గుర్తు. అయితే వారి కార్య కలాపాలుకొన్ని ఆయనకు కష్టం కలిగిస్తున్నట్లు వినికిడి. జెండావీధి హత్యకేసులో తమ మనోభీష్టం గ్రహించి మసలుకోలేదన్న కినుకతో రాత్రికి రాత్రి వన్‌టౌన్ సబిన్స్‌పెక్టర్‌ను మార్పించి, మరొకరిని నియమింపజేయడం ఆయనలో అనుమానం రేకెత్తించినట్లుంది. కాని ఆ చివాట్లేవో, సంబంధిత పోలీసధికారికి పడ్డాయి. అంత పెద్ద ఆఫీసరూ కుక్కిన పేనువలె గుక్కిరి మిక్కిరవకుండా తలవాయ బెట్టుకున్నారు. జనార్దన రెడ్డి వ్యతిరేకులుగా ముద్రపడిన యువ రాజకీయవారులు కొందరిని చేరదీయడం కూడా ఇద్దరి మధ్య అనుమానాలకు దారి తీస్తున్నది. టౌన్‌లో బలం పెంచుకోవడానికి వారికి అటువంటి శక్తులు అవసరం. అది అర్థమయ్యేట్లు చెప్పగల్గితే అపోహలు తొలగిపోతాయి.

ఎంత వరకు నిజమో గాని, మాగుంటకు అత్యంత అంతరంగిక సలహాదారు ఒకరు రానున్న ఎన్నికల్లో ఐదు సీట్లు తాము చెప్పిన ప్రకారం వచ్చే అవకాశం వుందని అక్కడక్కడా విశ్లేషించి మరీ చెప్తున్నట్లు వినికిడి. నెల్లూరుకు మాదాసు గంగాధరం లేదా మరొక మాగుంట ముఖ్యుడు; కోవూరుకు జెబి; ఆత్మకూరులో పెళ్లకూరు; సర్వేపల్లికి స్వంత కుటుంబీకుల్లో ఒకరు; రాపూరుకు కొమ్మి లక్ష్మయ్య నాయుడు- ఇదీ వారి టికెట్ల పంపకం అంచనా. పెళ్లకూరు పివిక గట్టిగా ఒక మాట చెబితే ఈ వరుస అసాధ్యం కాదన్నది వారి అంచనా. కాని పెళ్లకూరు అంత చొరవ తీసుకుంటాడా? పివి ఆయనకు అంత చనువు ఇస్తాడా? గతానుభవాలు చూస్తే అది నమ్మశక్యం కాని విషయం. మరీ గట్టిగా పట్టుబడితే తన వరకు చూస్తాడేమో తప్ప. పెళ్లకూరు సిఫార్సులు పివి పట్టించుకున్న సాదృశ్యం ఎప్పుడూ లేదు. తన మాట చలామణీ అయ్యే పక్షంలో పెళ్లకూరు ఈసారి తన కుమారులకు ఛాన్సు ఇప్పించడానికి యత్నించవచ్చు. జనార్దన రెడ్డి వంటి మేరు పర్వతాన్ని ఢీ కొని, జిల్లాలో స్వంత గ్రూపు కట్టే సాహసం, సమర్థత, ఓపిక, అవసరం పెళ్లకూరులో కన్పించవు.

ఒక వర్గంతో కలిపి వెళ్ళడానికి జెబి సమ్మతిస్తాడా అన్నది ఆలోచించాలి. జెబి ఎప్పుడూ సర్వ స్వతంత్రుడు. జనార్దన రెడ్డితో ఎడంగా వున్నాడనే కాని, వారిద్దరి మధ్య శత్రుత్వం లేదు. పై పెచ్చు కెవి సుబ్బారెడ్డి ఇప్పుడు మాగుంట దివాణంలో సభ్యుడై పోయాడు. "అంటే భవన్ సభకు

వెళ్లమంటారా" అని అడిగి "వద్దు" అంటే ఇంట్లోనే కూర్చునేంత బుద్ధిమంతుడైన ఫాలోయర్ అయిపోయాడు. తన శత్రువును మిత్రుడిగా ఆదరించే లోగిలిలో జెబి ఇమడ గలడా? లేకుంటే ఆయనకు దారి ఏది ఇప్పుడు? నిన్న గాక మొన్న జరిగిన ఉప ఎన్నికలో గుడ్లు తిరిగే మెజారిటీతో గెల్చిన నల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డిని ఢీకొని నిల్చే తొందరపాటుకు జెబి తల వూపుతాడని భావించలేము.

అసలీ పంపకాలన్నింటిని జనార్దన రెడ్డి సహిస్తాడా? అసంభవం! తనకు కాదని స్వతంత్రించి టికెట్లకు ప్రయత్నించే వారిని జనార్దన రెడ్డి ఎప్పుడూ దూరంగా పెడతాడు. ఆయన సాధ్యమైనంత వరకు సిటింగ్ అభ్యర్థులకే ఛాన్సు ఇస్తాడు, ఇవ్వాలి కూడా! జనార్దన రెడ్డి మనసులో ఏమి వుంటుందో, ఎవరు మెదలు తుంటారో కనిపెట్టడం ఆ బ్రహ్మతరం కూడా కాదు. అంత గుంభనమైన ఆలోచన. మాట్లాడకుండా, ప్రత్యర్థుల కీలక మెరిగి, సుడిమి పారేసే తత్వం. ఆనం వారిని దూరం చేసుకొనే ధోరణి ఆయనలో కన్పించడం లేదు. వారిని దువ్వాలంటే రాపూరు వారికివ్వాలి. అదే జరిగితే మాగుంట వారితో మాట తేడా వస్తుంది. వారిని వదులు కోవడానికి ఆయన సిద్ధంగా లేడు. ఆనం, నల్లపరెడ్డి, బెజవాడ వంటి రాజకీయ కుటుంబాలను అదుపులో పెట్టాలనే తత్వం జనార్దన రెడ్డిది. అది ఇంకా మారకుంటే ఆనం వారికి వట్టి చేతులే మిగులుతాయి. ఆనం కుటుంబీకులకు గెల్పించడం చేత కాక

పోయినా ఓడించడంలో సిద్ధహస్తులు. తెలుగుదేశం గాలి జోరుగా వీస్తున్న దనుకుంటున్న సమయంలో, ఒక్క సీటునైనా రిస్కులో పెట్టడం ప్రమాద మౌతుంది. పద కొండింటికి పదైనా గెల్పించుక పోగల్గితేనే ఢిల్లీలో పరపతి నిల్చేది. అందువల్ల జనార్దన రెడ్డి గారు గెల్చే గుర్రాలనే బరిలో నిలబెట్ట బోతారు.

ఏది ఏమైనా ఈ సారి ఎన్నికల లోగా జిల్లా కాంగ్రెస్‌లో చాలా మార్పులు చోటు చేసుకో బోతాయి. ముఖానికి నవ్వు తొడుగులు తగిలించు కొని తిరిగే వారంతా అనాటికి నిజ స్వరూపాలు వెల్లడి చేయక తప్పదు. అప్పుడు చూద్దాం - ఒక్కొక్కరి ముఖార విందాల సోయగం.

### పంచాంగం

#### కర్తరి జరుగుచున్నది

15 తేది ఆదివారము ఆది శంకరాచార్యుల జయంతి

#### మే తిథులు

వైశాఖ శుద్ధ

| | | | |
|---|---|---|---|
| తే 14శని | చతుర్థి | రా.గ. | 3.02 వ |
| తే 15ఆది | పంచమి | రా.గ. | 3.20 వ |
| తే 16సోమ | షష్ఠి | రా.గ. | 3.00 వ |
| తే 17మంగళ | సప్తమి | రా.గ. | 2.15 వ |
| తే 18బుధ | అష్టమి | రా.గ. | 12.58 వ |
| తే 19గురు | నవమి | రా.గ. | 11.28 వ |
| తే 20శుక్ర | దశమి | రా.గ. | 9.30 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.



రవీంద్రుని జయంతి సభలో ప్రసంగిస్తున్న మాడభూషి సుందరాచారి ; బెజవాడ గోపాల్‌రెడ్డి, పివి రమణారెడ్డి

# ఏడు మంది చచ్చినా ఏలికల్లో కదలిక లేదు!

వెంకటగిరి పట్టణంలో ఆక్రమణలు జోరందు కున్నాయి. సందులు గొందులు, రోడ్లు, రచ్చలు తేడా లేకుండా ఆక్రమిం చేస్తున్నారు. వీటి వల్ల రోడ్లన్నీ ఇరుకుగా మారి వాహనాల రాకపోకలకు తీవ్ర అంతరాయం కల్గుతూంది. అంతరాయాల సంగతి అటుంచితే, ఈ ఇరుకు రోడ్లులో 94 జనవరి నుండిఇప్పటి వరకు జరిగిన బస్సు ప్రమాదాల్లో ఏడు మంది ప్రాణాలు కోల్పోయారు. ఈ రహదారిలో టీ అంగళ్లు, కూరగాయల అంగళ్లు, చిల్లర అంగళ్లు, ఒకటేమిటి ఆల్ ఇన్ ఒన్ ఆక్రమణ దారులు 125 మంది వరకున్నారని ఇంతకు ముందు ఎమ్మార్వో శ్రీ బి.వి. సుబ్బారావు జరిపించిన సర్వేలో తేలింది. వీరిని ఆ ప్రదేశాల నుంచి ఖాళీ చేయించడంలో భాగంగా ఆక్రమించిన అంగళ్లకున్న విద్యుత్ కనెక్షన్లు తీసి వేయమని విద్యుత్ శాఖను కోరారాయన. పాత ఎమ్మార్వో రిటైర్డ్ కావడంతో విద్యుత్ శాఖాధికారులు ఆ విషయాన్ని మర్చిపోయారు. కొత్త ఎమ్మార్వో ఆక్రమణ తొలగింపు ఊసే ఎత్తడం లేదు. ఆక్రమణదారుల నుండి మామూళ్లు పుచ్చుకొని సరిపెట్టు కొంటున్నట్లు విమర్శలు వస్తున్నాయి. రోడ్ల మధ్య వాహనాల గడబిడలో ఏడు మంది ప్రజలు ప్రాణాలు కోల్పోయినా స్పందించిన అధికారే మండలంలో లేకపోవడం దారుణం. మామూళ్ల కంటే మనిషి ప్రాణాలు చులకనై నట్లుంది రెవిన్యూ శాఖ వారికి!

## నిరుపయోగంగా మహిళా బహిర్భూమి పథకం

రాపూరు హరిజనవాడలో తెలుగు మహిళా బహిర్భూమి పథకం క్రింద కట్టిన లెట్రిన్లు నిరుపయోగమయ్యాయి. 84 లో గ్రామ పంచాయితీ నిధుల నుండి లక్షరూపాయలు వెచ్చించి వీటి నిర్మాణం చేపట్టారు. ఈ లెట్రిన్లకు పంచాయితీ రాజ్ శాఖ నీళ్లట్యాంకు నుండి నీరు సరఫరా చేయాలని సంకల్పించారు. కాని నీళ్లట్యాంకునే ప్రారంభించక పోవడం వల్ల కట్టిన లెట్రిన్లు వుపయోగించకనే, పథకం మూలన పడింది. ప్రజలు కూడా బాధ్యతారహితంగా ప్రవర్తిస్తున్నారు. నీళ్ల ట్యాంకు ప్రారంభానికి అధికారులపై వత్తిడి తేకుండా లెట్రిన్లకు బిగించిన తలుపులు, రేకులు, బేసలు ఎవరికి చిక్కినవి వారు పట్టుకెళ్లుతున్నారు. ప్రజలీ విధంగా తయారవ్వడం వల్లనే జిల్లాలో లక్షలాది రూపాయలు ఖర్చు పెట్టి కట్టిన తెలుగు మహిళా బహిర్భూమి పథకాలు ఒక్క గ్రామంలోనైనా విజయవంతం కాక, నిధులన్నీ బూడిదలో పోసిన పన్నీరయ్యాయి.

## వెంకటగిరి దురాక్రమణలు తొలగించలేరా?

## ఇసుక డొంకలుగా మారిన అల్లూరు రోడ్లు

సరియైన ఆలన, పాలన లేక పోవడంతో అల్లూరు టౌన్‌లోని రోడ్లు ఇసుక డొంకలయ్యాయి. వాహనాలు సరికదా, పాదచారులు నడవడమే కడు కష్టంగా వుంది. రాయాజీ వీధి, కచ్చేరి వీధి వంటి వ్యాపార కూడళ్లలోని రోడ్ల పై మట్టంతా గాలికి షాపుల్లోనే వుంటున్నదని వ్యాపారస్తులు వాపోతున్నారు. వేణుగోపాల స్వామి వీధి, పోలేరమ్మ దేవాలయం వీధిలోని రోడ్లుఇసుక ఎడారులను తలపింప జేస్తున్నాయి. ఎప్పుడో 1968 లో తారు రోడ్లు వేసిన తరువాత పంచాయితీ వీటి అభివృద్ధి విషయం పట్టించు కోక పోవడం వల్ల ఈ రోడ్లు అధ్వాన్న స్థితికి చేరుకున్నాయి. పేరు గొప్ప, ఊరు దిబ్బ అన్నట్లు రాష్ట్రంలోనే పెద్ద పంచాయితీ; చిన్న చిన్న పంచాయితీలు సైతం సిమెంటు రోడ్లు వేసుకుంటున్నా అల్లూరుకు ఆ అదృష్టం లేనట్లుంది. ఇంతకు ముందు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లు కనీసం రోడ్ల పై మట్టినైనా తొలగించి ప్రజలకు ఇబ్బంది లేకుండా చేసే వారు. కొత్త ఇఓ గారు ఇవన్నీ మనకెందుకు; అని గమ్మునున్న ట్లుంది. జిల్లా పంచాయితీ అధికారి గారికి అల్లూరీయులంటే కోపమున్నట్లుంది. వుదాసీన వైఖరి చూపే వారిని, పనులకు ఆమడ దూరంలో వుండే వుద్యోగులను ఏరి మరీ అల్లూరు పంచాయితీ కార్యాలయంలో పోస్ట్ చేస్తున్నారు.

# సారాయి వలె పొదుపులోనూ నెల్లూరు మహిళలు ముందు సీటు పొందాలి!

సారా వ్యతిరేక వుద్యమం తరహాలో జిల్లా మహిళలను ఆకర్షిస్తున్న పొదుపు లక్ష్మి పథకం పట్ల ప్రభుత్వ యంత్రాంగం ప్రత్యేక శ్రద్ధ చూపుతూంది. వారంలో ఒక రోజు జిల్లా కలెక్టర్ జిల్లాలోని ఒకటి, రెండు మండలాల్లో మహిళా సదస్సులకు హాజరై మహిళామణులకు మరింత ఉత్సాహాన్ని ఇస్తున్నారు. రాష్ట్రంలోని జిల్లాను ఈ పథకంలో అగ్రగామిగా నిలపాలన్న ప్రయత్నంలో భాగంగా చిన్న మొత్తాల పొదుపు సంస్థ కమీషనర్ జె. బాపురెడ్డి గతవారం జిల్లాలో పర్యటన జరిపారు. సంగం మండల కేంద్రంలో క్రిక్కిరిసిన మహిళా సదస్సులో ఆయన మాట్లాడారు. జాతి ప్రయోజనాలకు పొదుపు ఎంతో అవసరమని, మహిళలందరూ పొదుపు లక్ష్మి పథకాన్ని విజయ వంతం చేసేందుకు వుద్యమించాలని కోరారు. మర్రి గింజ చిన్నదైనా మహా వృక్షమై ఎందరికో నీడ నిస్తున్నట్లు పొదుపు లక్ష్మి పథకంలో మహిళలు ఆదా చేసే ప్రతి పైసా జాతి ప్రయోజనాలకు ఎంతగానో వుపయోగ పడుతుందన్నారాయన. పొదుపు పథకాల ద్వారా 16 వందల కోట్లు సేకరించాలన్నది రాష్ట్ర ప్రభుత్వ లక్ష్యం కాగా ఇప్పటి వరకు 14 వందల కోట్లు సేకరించారని ఇందులో నెల్లూరు జిల్లా వాటా లక్ష్యం6.3 కోట్లకు తప్పక చేరుతుందన్న ఆకాంక్ష వ్యక్త పరిచారు. జిల్లా కలెక్టర్ ఎం సాంబశివరావు ప్రసంగిస్తూ పొదుపు లక్ష్మి పథకాన్ని మహిళలు ప్రతిష్టాకరంగా భావించాలని కోరారు. డిడిఓ విష్ణు, ఫాక్రా అధికారిణి శ్రీమతి విజయభారతి, డి.ఆర్. డి.ఎ ప్రాజెక్ట్ డైరెక్టర్ చంద్రశేఖరరెడ్డి, కావలి ఆర్డీఓ రాజారత్నం, డిఎస్ఓ భరత్ రెడ్డి, ఎమ్డీఓ మధుసూదన రావు కార్యక్రమంలో పాల్గొన్నారు. పొదుపు లక్ష్మి పథకంలో ఉన్నత ఫలితాలు సాధించిన 10 గ్రామ పంచాయితీలకు కుట్టు మిషన్లను కమీషనర్ అందజేశారు.

## జిల్లా వార్తలు

## పొదలకూరులో క్రికెట్ పోటీలు

పొదలకూరులో మండల స్థాయి క్రికెట్ పోటీలు ఈ నెల 22 తేది జరుగ నున్నాయి. వెంకటగిరి, గూడూరు, మనుబోలు, సైదాపురం, డక్కిలి, రాపూరు, కలువాయి, ఆత్మకూరు, సంగం, పొదలకూరు, అనంతసాగరం, . బుచ్చిరెడ్డిపాళెం,

కొరవ 8 పేజీలో

## పబ్లిక్ నోటీసు

మా కక్షిదారులైన ఉదయగిరి శ్రీరాములు గారి కుమారుడు మస్తానయ్య సదరు శ్రీరాములు గారి భార్య లక్ష్మమ్మ పెద్ద బజారు, నెల్లూరు వారు ఇచ్చిన సంజాయిషీ మేరకు ఈ దిగువ పబ్లిక్ నోటీసు జారీ చేయుచున్నాము.

మా కక్షిదారులకు వేదాయపాళెం గ్రామము నెల్లూరు మునిసిపల్ ఏరియాలో పాత సర్వేనంబరు 85-1, క్రొత్త సర్వేనంబరు 8/1Bలో 37 సెంట్ల భూమికి సర్వ హక్కులు కలిగి వున్నారు.

సదరు భూమిని లోగడ 11-10-1993 రోజున 1. కరణం భాస్కరనాయుడు, S/o. వెంకటరత్నం. AC నగర్, నెల్లూరు; మెంటా వెంకట మురళీ కృష్ణ, అయితా రామమూర్తి, వేలంలాటి సుధాకరరెడ్డి, చింతం బ్రహ్మారెడ్డి, A. అంకయ్య అను నెల్లూరు వాస్తవ్యులకు విక్రయ అగ్రిమెంటు వ్రాయించి ఈ భూమిని అమ్మజూప దలచినాము. అగ్రిమెంటు షరతుల ప్రకారము 10-3-1994 నాటికి మిగతా సైకము చెల్లించి రిజిష్టర్డు విక్రయ పత్రము మా ద్వారా పొందులాగున తీర్మానించడమైనది. సదరు గడువు ప్రకారము పై ఆసాములు మిగతా విక్రయ ధనము చెల్లించని కారణముగా సదరు అగ్రిమెంటు మా కక్షిదారులు రద్దు పరచినారు. 11-10-93 దినమున మా కక్షిదారులు కరణం భాస్కర్ నాయుడు గారిని జనరల్ పవర్ ఆఫ్ అటార్నీ ఏజెంటుగా నియమించి వారికి పవర్ ఆఫ్ అటార్నీ వ్రాయించి ఇచ్చినారు. సదరు పవర్ ప్రకారము మా కక్షిదారుల భూమిని ఇతర భూములతో కలిపి లే అవుట్ వేయించుటకు, గాను దరఖాస్తు వేయుటకును మునిసిపాలిటీవారి ద్వారా అప్రూవల్ మేరకు చేయు సదరు పనులకు మా తరఫున ఎలక్ట్రిసిటీ వారితో సంప్రదించుటకు సదరు సంజాయిషీ నిమిత్తము మా తరఫున వ్యవహరించుటకు సర్వ హక్కులు వ్రాయించి ఇచ్చియున్నారు. లోగడ 18-3-94 న మా కక్షిదారులు సదరు కరణం భాస్కర్ నాయుడు తదితరులకు లాయరు నోటీసు ద్వారా 11-10-93 నాటి విక్రయ అగ్రిమెంటును సదరు అదే దినమున భాస్కర నాయుడు గారికి వ్రాయించి ఇచ్చిన జనరల్ పవర్ ఆఫ్ అటార్నిని రద్దు పరిచినామని తెలియపరచి యున్నారు.

కావున అందుమూలముగా యావన్మందికి తెలియ చేయడమేమనగా సదరు కరణం భాస్కర్ నాయుడుగారికిని, ఇతరులకు ఎటువంటి సంబంధం లేదు. సదరు భూమికొనుగోలు లావాదేవీలు భాస్కర్ నాయుడు మరియు తదితరులతో గాని జరిపిన, మా కక్షిదారులను గాని సదరు ఆస్తిగాని బద్ధులింపవు. అట్టి చర్యలు ఏమైనను జరిపిన మా కక్షిదారులు తీసుకొను సివిల్, క్రిమినల్ మరియు ప్రొసీడింగ్స్‌కు బద్ధులగుదురు.

ఎమ్. చంద్రశేఖర్,
ఆర్. వేంకటేశ్వరమూర్తి,
అడ్వకేట్లు, నెల్లూరు



## PUBLIC NOTICE

Under the Instructions of my client Viz., Sri Amancherla Siva Sankara Rao, S\0. Subba Rao, presently working in minor Irrigation Department, Srikalahasti, issue herein the following notice:

That my client is a Heart patient since a long time and that he is under the verge of retirement from his services on 31-7-1994. If any body wants to approach him for settlement of their rights financial matters or to make any correspondence thereof or any other matters must be done with my client's knowledge either by person or by corres pondence for peaceful settlement of their rights or any other matters. If any body acts contrary to these instructions behaves or approaches him either by person or by way of writiing hurting letters, or by propagating baseless reports on my client, will entitel to either by Civil or Criminal actions or both according to Law. As being a heart-patient there is every posibility to endanger his life, peaceful living and disturbance over the tranquility in the society and longvity of life which may cause prematured death of my client. Further, it is informed that this notice will apply to their kith and kin also.

If any body or his family members borrows moneys or have the financial dealiings etc, from others without my knowledge or my client's knowledge, it will be on their own personal risk, and responsibility and my client will not be held responsible for such transactions and consequences, whether it is done earlier to this public notice, or infuture from the date of issue of this notice.

K.V. Ramana Rao, B.Com., B.L.
Advocate.

## చిత్రసమీక్ష

9 వ పేజీ కొరవ

ఆడవాళ్లు. ఆ సమయంలో కంప్యూటర్ డిజైనర్‌గా సత్య (రేవతి)ఆ ఆఫీసుకు వస్తుంది. ఆమెను ట్రాక్‌లో పెట్టాలన్న మన్మథరావు ఉత్సాహానికి బ్రేక్ వేస్తుంది. ఆఫీసులో జరిగిన ఒక చిన్న సంఘటన మూలంగా సత్య, జానకి, పాపమ్మ ఒక జట్టుగా మారుతారు. ఒక రోజు పొరపాటుగా జానకి చక్కెర బదులుగా ఎలుకల మందు కాఫీలో కలిపి మన్మధరావు కిస్తుంది. అతను స్పృహ తప్పడంతో సత్య అతన్ని హాస్పిటల్‌లో చేరుస్తుంది. ఒక కరడు గట్టిన తీవ్రవాది (నగేష్) మరణం విషయం పోలీసులు, డాక్టర్లు మాట్లాడడం వినిన జానకి, పాపమ్మ తమ నిర్లక్ష్యం మూలంగానే మేనేజర్ చనిపోయాడని భావించి, సత్య సలహాపై ఆ శవాన్ని మాయం చేయను పడరాని పాట్లు పడతారు. తాను ఆసుపత్రి పాలు కావడానికి ముగ్గురు ఇంతులే కారణమన్న విషయం తెలుసుకొన్న మన్మధరావు తనతో మూడు రోజులు హనీమూన్‌కు రాకుంటే ముగ్గురినీ పోలీసులకు పట్టిస్తానంటాడు. పోలీసుల బారినుండి తప్పించుకొను మేనేజర్ కోరికకు ఒప్పుకొన్న మగువలు కలసికట్టుగా తెలివిగా అతన్ని ఒక గెస్ట్ హౌస్‌లో బంధిస్తారు. తెల్లకాగితంపై మేనేజర్ సంతకం ద్వారా ఆఫీసు సర్వాధికారాలు చేజిక్కించుకొన్న ఆ మహిళలు ఆఫీసును పలుకొత్త పుంతలు త్రొక్కిస్తారు. ఆడవాళ్లకు అవసరమైన అన్ని సదుపాయాలు, సౌకర్యాలు కల్పించి ఆఫీసును లాభాల బాటలో నడుపుతారు. చివరన కంపెనీ యజమాని (కమలహాసన్) ఆడవాళ్ల ధైర్యాన్ని మెచ్చుకొని, అసలు విషయం తెలుసుకొని మన్మధరావును అండమాన్‌కు ట్రాన్స్‌ఫర్ చేస్తాడు. సత్యను తన ఇల్లాలిగా చేసుకోవడంతో చిత్రం పరిసమాప్త మవుతుంది.

చిత్రానికి కథకుడైన కమల్‌హాసన్ కథ మొత్తం ఆఫీసులోనే నడిపాడు తప్ప వుద్యోగినులు బయటపడే కష్టాలు గూర్చి చెప్పడంలో విఫలమయ్యాడు. సినిమాలో అత్యంత తెలివిగా మేనేజర్‌ను ' పక్కా పోకిరోడా ' అంటూ నిలదీసే కంప్యూటర్ డిజైనర్ సత్య, ఆసుపత్రిలో మన్మధరావును చేర్చాక మరీ అధైర్యవంతురాలుగా కనపడటంతో సెకండ్ హాఫ్‌లో ఆ పాత్ర దెబ్బ తినింది. సత్య కోసం మేనేజర్ పట్టు చీర కొనమనడం, ఆ ఉక్రోషం సెక్రటరీ జానకి భరించలేక మేనేజర్ భార్యకు చెప్పడం వంటి సన్నివేశాలు ఆడవాళ్ల సహజమైన మనస్తత్వాన్ని వెల్లడించాయి. మేనేజర్‌ను అన్నిరోజులు కిడ్నాప్ చేస్తే ఆఫీసులో వుద్యోగులు సరే ; అతని భార్యకు కూడా అనుమానం రాకపోవడం అసహజంగా వుంది. పొందికైన మాటలు, పాటలతో డబ్బింగ్ చిత్రం చూస్తున్న భ్రమ నుండి బయటకు తెచ్చాడు రాజశ్రీ. ఇళయరాజా సంగీతం ఆశించినంత స్థాయిలో లేకున్నా 'చక్కని చుక్కలు మూడు' పాటకు చక్కని ట్యూన్ ఇచ్చాడు. తిరునా వుక్కరుసు కెమెరా, నందమూరి హరిబాబు కూర్పు విసుగు లేకుండా చేశాయి. నటీ నటుల్లో రేవతి, [illegible]

నటించారని చెప్పవచ్చు. ఒక సన్నివేశంలో మాత్రమే కనపడే హాస్య నటుడు నగేష్, చిత్ర తమిళ మాతృక నిర్మాత కమలహాసన్ తమకు తిరుగు లేదనిపించారు. వీరందరిని సరియైన బాటలో నడపడంలో దర్శకుడు సింగీతం శ్రీనివాసరావు విజయం సాధించారు.

## రాపూరు

( 2 వ పేజీ కొరవ )

లక్ష్మయ్య నాయుడు, జయచంద్రారెడ్డి తదితరులంతా నెండ్లూరుకు పరుగెత్తుకొని పోయి ప్రసాద్ రైలెక్కకుండా నిలిపారు. ఎప్పుడో వస్తుందనుకునే రాజకీయ లబ్ధికంటే, ఇప్పుడు మాగుంట సుబ్బరామరెడ్డి చెలిమి ద్వారా లభించే ఆర్థిక సాయమే మీ కుటుంబానికి ఉపయోగకరమని నచ్చచెప్పి, అతి కష్టం మీద అతడి తెలుగు దేశం ప్రవేశం నిరోధించారు. కాంగ్రెస్‌లో టికెట్ ఇప్పిస్తామని గట్టిగా హామీ కూడా ఇచ్చారట.

వాగ్దానమైతే చేశారు కాని రాపూరు సీటుపైన ఈ నచ్చ చెప్పిన నాయకులందరికీ ఆశ వుంది. కొమ్మి లక్ష్మయ్య నాయుడు చాలా కాలం నుంచి మాగుంటవారి సహకారంతో ఆ సీటు తెచ్చుకోవాలని తలపోస్తున్నాడు. మాజీ ఎమ్మెల్యే రాజమోహన్‌రెడ్డి సహకారంతో తమకే టికెట్ వచ్చేట్లు చూడడానికి పాపకన్ను సోదరులు గట్టి ప్రయత్నంలో వున్నారు. ప్రసాద్‌ను పార్టీ మారకుండా నివారించే చిన్న పనికోసం వీరు తమ ఆశలు త్యాగం చేస్తారా? అంతటి త్యాగ ధనులు ఇప్పటి రాజకీయాలలో ఎవరూ లేరు

## జిల్లా వార్తలు

( 7 వ పేజీ కొరవ )

మండలాల క్రీడాకారులు ఈ పోటీలలో పాల్గొనేందుకు అర్హులు. దరఖాస్తులను 18 తేది లోగా వై. రాఘవేంద్ర, స్టార్ లెవన్ క్రికెట్ అసోసియేషన్ , రామ్‌నగర్, పొదలకూరుకు ఎంట్రీఫీజుతో పంపాలి. విజేతలకు 516, 316రూపాయలు బహుమతులుగా అందచేస్తారు. ఉత్తమ బ్యాట్స్ మెన్, బౌలర్స్‌కు ప్రత్యేక బహుమతులు ఉంటాయని నిర్వాహకులు తెలియ చేస్తున్నారు.

### కోవూరు గ్రామీణ రోడ్లకు నిధులు మంజూరు

కోవూరు నియోజక వర్గంలోని గ్రామీణ రోడ్ల నిర్మాణానికి రెండు లక్షలా ఎనభై వేల రూపాయల నిధులు జిల్లా కలెక్టర్ మంజూరు చేశారు. రోజ్‌గార్ నిధుల నుంచి వీటిని మంజూరు చేసినట్లు శాసన సభ్యుడు నల్లపు రెడ్డి ప్రసన్నకుమార్ రెడ్డి తెలిపారు. ఈ నిధులతో విడవలూరు మండలం అలగానిపాడు నుంచి వీరారెడ్డి పాళెం వరకు రోడ్డు నిర్మాణానికి రెండు లక్షలు, దామేగుంట రోడ్డుకు 30 వేలు చాకచర్ల, పల్లిపాళెం రోడ్డుకు అదనంగా 50 వేలు ఇచ్చారు.

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

నీవే నా కుమారుడవైనట్లయితే డాక్టర్ల ఆజ్ఞలు పాలించినందుకు, ఈపాటికి నా చేతుల్లో కొరడా దెబ్బలు తినేవాడివి" అని గాంధీజీని ప్రేమ వాత్సల్యంతో గద్దించింది.

## జనవాణి

(3 పేజీ కొరవ)

### నియోజకవర్గ మంత్రులు

నెల్లూరు జిల్లా నుండి మంత్రివర్గంలో ఇద్దరు మంత్రులు ప్రాతినిధ్యం వహిస్తున్నారు. పసల పెంచలయ్య ( గృహ నిర్మాణశాఖ మంత్రి), కలికి యానాదిరెడ్డి (దేవాదాయమంత్రి);కాని ఇరువురూ తాము జిల్లామంత్రులన్న సంగతి మర్చిపోయి, నియోజకవర్గ మంత్రులుగా మిగిలిపోయారు. ఒకరు హైదరాబాద్ టు నాయుడుపేట, సూళ్లూరుపేట, తత వయా చిట్టమూరు తరువాత ఫలో హైదరాబాద్. రెండోవారు కావలి టు హైదరాబాద్‌లకే పరిమితమయ్యారు. విశ్రాంతి అవసరమైతే మాత్రం నెల్లూరు సోమశిల గెస్ట్‌హౌస్‌కు చుట్టపు చూపుగా వచ్చి వెళతారు. జిల్లాలో ని నియోజకవర్గ అభివృద్ధి విషయమూ వీళ్లకు పట్టదు. వెనుకబడిన ప్రాంతాలు, సమస్యలు రానురాను ఎక్కువై పోతున్నాయి.యి. మంత్రులుగా వున్నందజిల్లా మొమొత్తం అభివృద్ధిని పట్టించుకోవడం వారి ధర్మం. .

కలిచేడు - షేక్ మహబూబ్ బాషా

### పాస్‌పోర్ట్ అప్లికేషన్ పోస్టల్ దోపిడీ!

1993జూలై నెలలో కేంద్రప్రభుత్వం జారీ చేసిన ఆర్డినెన్స్ ప్రకారం పాస్‌పోర్ట్ రిజిస్ట్రేషన్ ఫీజు 300 రూపాయలుగా నిర్ణయించి, అప్లికేషన్ ఫారం వుచితంగా అందజేస్తామని ప్రకటించారు. కాని పోస్టాఫీసులో ఇచ్చే ఫారాలకుగాను సర్వీస్ ఛార్జి మూడు రూపాయలు తీసుకోవచ్చుని మినహాయింపు ఇచ్చారు. ఈ ప్రకారం రాష్ట్రంలోని అన్ని పోస్టాఫీసుల్లో మూడు రూపాయలకే పాస్‌పోర్టు అప్లికేషన్ ఫారాలు లభిస్తున్నాయి. కాని నెల్లూరు టౌన్ మెయిన్ పోస్టాఫీసులో మాత్రం 13 రూపాయలు వసూలు చేస్తున్నారు. అదేమని ఎవరైనా అడిగితే తమకు ఇంకా వుత్తర్వులు రాలేదని బుకాయిస్తున్నారు. రాష్ట్రంలో అన్ని పోస్టాఫీసులకు వచ్చిన ఉత్తర్వులు నెల్లూరుకు రాకపోవడం ఎంతమాత్రం నమ్మశక్యమో ! ఏది ఏమైనా ప్రజా సేవ చేయవలసిన డిపార్టమెంట్ ఈ విధమైన బహిరంగ దోపిడీకి పాల్పడడం దారుణం. ఉన్నతాధికారులు ఈ పరిస్థితి చక్క దిద్దాలని మనవి.

నెల్లూరు - టి.వి.సురేష్ బాబు


జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100-
అర్థ సంవత్సర చందా రూ. 50
విడిప్రతి రూ. 2.00



రౌడీ ఎంఎల్ఏలో కాస్ట్యూమ్ కృష్ణ

# నాగార్జునను అభిమానిస్తే అమలకు అన్యాయం చేసినట్లా?

## అన్నెంపున్నెం తెలియదంటున్న నగ్మా

ఇటీవల మద్రాసులో నగ్మా కొన్ని విషయాలను కుండ బద్దలు కొట్టినట్లు చెప్పింది : "ఈ విజయశాంతి 'లేడి అమితాబ్' అయితే కానివ్వండి. అందుకని నన్ను నగ్మాతో గాని, రవీనాతో గాని పోల్చకండి" అని "స్టార్ డస్ట్" పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో మా పేర్లు ఉదహరించడం న్యాయమా? నేను సినిమా రంగంలో ప్రవేశించి నాలుగేళ్లే అయింది. రవీనా మూడు నాలుగు చిత్రాలలో నటించి ఉండొచ్చు. ఈమెకు మేమే దొరికామా? ఆమె ఏదో అల్లకల్లోలమైన మనసుతో ఉండగా ఇలా మాట్లాడి ఉంటుందేమో! నటిగా నేను ఆమెను మించిన స్థాయికి ఎదిగినా ఆమె గురించి ఆమె ధోరణిలో పలికి ఉండేదాన్ని కాను. ఆమె ఈ పరిశ్రమలో ప్రవేశించి, 15 ఏళ్లు దాటి ఉంటుంది కదా ? ఇలా నోరు పారేసుకోవడం వల్ల ఆమెకే చెడ్డ పేరొచ్చింది. నేను ఒక మెట్టు ఎదిగాను". కాస్సేపాగి మళ్లీ ఆమె -కొన్ని వదంతులను ఎవరు పుట్టిస్తారో తెలీదు. హీరోలలో నాకు నాగార్జున అంటే ఎంతో ఇష్టం. ఇందులో తప్పేముంది ? అంతమాత్రం చేత ఆయన్ని నేను వలలో వేసుకున్నందువల్ల ఆయనకు అమల దూరమైందన్న పుకారు ఏమిటి? ఒక తెలుగు చిత్రంలో నటించడానికి ఆయనతో నేను సింగపూరు వెళ్లినప్పుడు ఆయన త్వరలో అమలను వివాహం చేసుకోబోతున్నట్లు చెప్పారు. శుభాకాంక్షలు అందజేశాను. అటువంటి నేను వాళ్లిద్దరి మధ్య ఎడబాటు కల్గడానికి కారకురాల్ని అవుతానా? నేను తెలుగులో పెద్ద హీరోల సరసన నటించడం గిట్టని తెలుగు తారలే ఈ దుష్ప్రచారాన్ని సాగిస్తున్నట్లు నా అనుమానం. నిజా నిజాలు భగవంతుడికి తెలుసు. అన్నెం పున్నెం ఎరుగని నేను ఇలాంటి అపవాదులను ఎందుకు పట్టించుకోవాలి?" అంటున్నప్పుడు ఆమె ముఖం మరింత జేవురించింది.

### బాలకృష్ణ నటించే "టాప్ హీరో"

"బాలకృష్ణ సరసన నాయికగా నటించబోయే అదృష్టవంతురాలు ఎవరో త్వరలో తెలియజేస్తాను." అన్నారు ఎస్.వి.కృష్ణారెడ్డి. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, సంగీతం, దర్శకత్వంలో అచంట గోపీనాథ్ నిర్మించే "టాప్ హీరో" చిత్రంలో కోట శ్రీనివాసరావు, బ్రహ్మానందం, ఆలీ, రోహిణీ హట్టంగడి, లతశ్రీ, మహేష్ ఆనంద్ పాత్రధారులు.

# వినోదపు పన్నును ఏ కంచె మేస్తున్నది?

90 ప్రింట్లతో విడుదలైన విజయ - చందమామ వారి "భైరవద్వీపం" చిత్రం మొదటి వారంలోనే నిర్మాత షేర్ 65 లక్షలు దాటి కొత్త రికార్డు సృష్టించింది. నాలుగున్నర కోట్ల వ్యయంతో భారీ ఎత్తున మద్రాసులో నిర్మించబడిన తెలుగువారి జానపద కథల ఔన్నత్యాన్ని గుర్తు చేసే ఈ చిత్రానికి ఎటువంటి రాయితీలూ లేవు. డబ్బింగ్ చిత్రంగా పూర్తి వినోదపు పన్ను 24 శాతం వసూలు చేయబడుతోంది. "కాని, ఆ పన్నులో కొంతభాగం ప్రభుత్వానికి అందకుండా, పరిశ్రమకు దక్కకుండా ఎక్కడికో అంతర్థానమై పోతోంది. ఈ అగాధం ఏమిటో తెలుసుకుంటే గాని, ఈ విద్రూరం బయట పడదు," అని తమ బాధను వ్యక్తం చేశారు ఈ చిత్ర సమర్పకులు, 'విజయచిత్ర-చందమామ' ఎడిటరు, సెన్సార్ బోర్డు సభ్యుడు అయిన బి.విశ్వనాథరెడ్డి. ఈ మిస్టరీ ఏమిటో బయటపడితే గాని, తెలుగు సినిమా రంగానికి మంచిరోజులు రావు. కాని, కంచే చేను మేస్తున్నప్పుడు కనుగొనడం అంత తేలికా?

### చందమామ విజయ వారి తదుపరి చిత్రాలు

"భైరవద్వీపం" తమిళంలో "విజయ ప్రతాపన్"గా డబ్ చేయబడింది. రజనీకాంత్‌తో "వాద్యారయ్యా (బడిపంతులు)" చిత్రానికి డి.వి.నరసరాజు కథ రాశారు. కమలహాసన్, గౌతమి నటించే 'నమ్మవర్' (మనవారు) చిత్రానికి సేతు మాధవన్ దర్శకుడు. ఇద్దరు తమిళ టాప్ హీరోలతో ఒకేసారి రెండు చిత్రాల నిర్మాణాన్ని సాగించటం ఆ సంస్థకు తప్ప మరెవరికీ సాధ్యం కాదు. తెలుగులో ఒక సంపూర్ణ వినోదాత్మక చిత్రాన్ని నిర్మించడానికి మరోవంక సన్నాహాలు జరుగుతున్నాయి.

### కె.విశ్వనాథ్ చిత్రంలో కమల్, బాలు

తెలుగుదనం ఉట్టిపడే సాహిత్య, సంగీత, నృత్య, ప్రధాన చిత్రాలు రూపొందించడంలో తనకు తానే సాటి అనిపించుకున్న 'కళా తపస్వి' కె.విశ్వనాథ్ దర్శకత్వంలో చిత్రం వచ్చి చాలా కాలమైంది. "ఇప్పటి ప్రేక్షకుల అభిరుచులకు తగ్గట్టు నేను చిత్రాలు తీయలేనేమో!" అనే నిస్పృహతో ఉన్న ఆ దర్శకాగ్రేసరుని దర్శకత్వంలో ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, స్వయంగా ఒక చిత్రాన్ని నిర్మించడానికి పూనుకున్నారు. ఈ చిత్రంలో కమలహాసన్ హీరో.

*

# మెయిన్ విలన్‌గా మళ్లీ రాజనాల

కొత్త విలన్లు రావడంతో రాజనాల వంటి ఆరితేరిన నటులకు అంత ప్రాధాన్యత గల పాత్రలు ఇటీవల లభించడం లేదనే చెప్పాలి. మే 25 నుంచి కృష్ణా జిల్లా బొబ్బర్లంకలో కాంతి ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న శృంగారపురం ఒక కిలోమీటరు చిత్రంలో రాజనాలను మెయిన్ విలన్‌గా బుక్ చేశారు.

### ప్రకటన

నెల్లూరు కామాటి వీధి, వార్డు నం 19, యింటి నెంబరు 432, అసెస్‌మెంటు నం. 26932 గల యిల్లు, నాకును, నా తమ్ముడు లేటు రాధాకృష్ణ మూర్తికిని సొంతమై యున్నది. ప్రస్తుతము ఆ యింట్లో కాపురము ఉంటున్న మా తమ్ముని వారసులు, ఆ యిల్లు వారి సొంతమని నమ్మించి అమ్మ చూపుతున్నట్లు తెలిసినది. నా ప్రమేయం లేకుండా, వారి దగ్గర విక్రయము చేయించుకున్న, అట్టి విక్రయ పత్రము చెల్లదని ఈ ప్రకటన మూలముగా అందరికీ తెలియ జేయడమైనది.

కటారి లక్ష్మీ నారాయణ
18/72/7, బాలాజీనగర్, నెల్లూరు.

## మగవాళ్లు కూడా ఎంజాయ్ చేయవచ్చు!

# "ఆడవాళ్లకు మాత్రమే"

చిత్ర సమీక్ష
అల్లూరు రహీం

మధ్య తరగతి కుటుంబ రథాన్ని లాగేందుకు మహిళలు తప్పని సరిగా వుద్యోగాలు చేయవలసి వస్తుంది. పురుషాధిక్యతతో కూడిన సమాజంలో ఆడవారు తమ ఔన్నత్యాన్ని నిలుపుకుంటూ ఆ వుద్యోగాలు చేయడం కత్తి మీద సామే. దానికి తోడుగా ఆఫీసుల్లో 'సరసులైన బాస్'లు వుంటే ఇంతులు పడే చింతలు వర్ణనాతీతం. పలు ప్రయోగాత్మక చిత్రాలు తీసి విజయవంతమైన బాటలో సాగిన నటుడు కమలహాసన్, దర్శకుడు సింగీతం శ్రీనివాసరావు ద్వయం ప్రవేట్ సంస్థల్లో మహిళా ఉద్యోగినులు పడే పాట్లను 'ఆడవాళ్లకు మాత్రమే' చిత్రంలో చక్కగా ప్రస్తావించి, గర్వాంధులైన పురుషుల సంజాయిషీని అడిగారు. ఆడది అంటే ప్రాణం లేని బొమ్మ - ఆశలు లేని జన్మ కాదని ఎలుగెత్తి చాటారు. ఇందులో ఒక హీరోయిన్ పెళ్లి చూపుల్లో గొంతెమ్మ కోరికలు కోరే పెళ్లికొడుకు షరతులు అన్నింటికీ ఓ.కే. అని చెప్పి, 'తాళి' మాత్రం తాను కడతానంటుంది. ఆడవాళ్లు పబ్లిక్ ప్రాపర్టీ కాదు - ప్రెషర్ కుక్కర్లు, ఫ్రిజ్‌లు, వంట సామాన్ల వంటి వాటి టి.వి. ప్రకటనల్లో ఆడవాళ్లను వంటింటి కుందేళ్లుగా చూపడం తగదని గర్జిస్తుంది. ఆడవాళ్లలో చైతన్యం రావాలని గళమెత్తుతుంది. ఆఫీసుల్లో ఆడవారి కష్టాలకు కమర్షియల్ టచ్‌కోసం భారీ స్టార్లు, దర్శక ప్రతిభ మూలంగా పండిన హ్యూమర్ సీన్లు ఆడవాళ్లే కాదు మగవాళ్లు కూడా అద్యంతం ఎంజాయ్ చేస్తూ సినిమా చూసేయవచ్చు.

ఇక కథలోకి వెళితే ఎక్స్‌పోర్ట్ క్వాలిటీ రెడీమేడ్ గార్మెంట్స్ కంపెనీ మేనేజర్ జి.కె.మన్మథరావు ( నాజర్) బహు సరసుడు. ఆఫీసులో స్వీపర్ పాపమ్మ ( రోహిణి) మొదలుకొని సెక్రటరీ జానకి (ఊర్వశి) వరకు ఏదో ఒక వంకతో తన ఛాంబర్‌లోకి పిలిచి వారిని స్పృశిస్తూ, రెచ్చగొట్టేలా మాట్లాడుతూ మురిసి పోతుంటాడు. సహజమైన బేలతనం వల్ల ఈ విషయాలను ఎవరికి చెప్పుకోలేక కుక్కిన పేనుల్లా వుంటారు అందరు

కొరవ 8 పేజీలో

గోడల మీద వ్రాతలు లేవు; చెట్ల పై జెండాలు ఎగరడం లేదు; వీధుల్లో కార్లు తిరగడం లేదు;
ఎన్నికల ఖర్చు లక్షా 50 వేలు దాటుతుందేమోనని పైసా పైసా లెక్క పెట్టి వెచ్చిస్తున్నారు; రిగ్గింగు వుండదని దిగులుపడి పోతున్నారు!

# ఎన్నికల చరిత్రలో ఇదొక అపూర్వ ఘట్టం!

అభ్యర్థులతో కలసి మాట్లాడడానికి భయపడి పోతున్నారు. ముఖ్యమంత్రి కుమారుడి ఎన్నిక అయినా, ఆఖరుకు రెవిన్యూ ఇన్స్‌పెక్టర్ స్థాయి ఉద్యోగులు కూడా బహిరంగంగా ఎక్కడికీ రావడం లేదు సాక్షాత్తు ముఖ్యమంత్రి ఈ విషయంలో అతి జాగ్రత్త పడుతున్నారు. మొన్నటి కర్నూలు పర్యటనలో తాను ప్రైవేటు కారులో రావడమే కాదు. తన సెక్యూరిటీ సిబ్బంది కోసమూ ప్రైవేటు ట్యాక్సీలు తెప్పించారు. దారిలో జర్నలిస్ట్ దగ్గర ఎస్కార్ట్ ట్యాక్సీ చెడిపోతే, కొత్త ట్యాక్సీ వచ్చే వరకు రోడ్లో నిలబడి వుండినారు తప్ప, ప్రభుత్వ వాహనాలను వాడలేదు. కలెక్టర్లు, ఎమ్మార్వోల పని హాయిగా వుంది. ఓటర్లను దువ్వడం కోసం పట్టాలిమ్మని లేదా మంచి నీటి పథకాల వంటివి మంజూరు చేయించమని అడిగే వారు లేరు. ఒక్క ఉత్తర్వు చేస్తే శేషన్ ఎక్కడ పీక పట్టు కుంటాడోనని అధికార్లు, అధికార దుర్వినియోగం అని తిడతాడేమో నని అభ్యర్థులు హడలి పోతున్నారు.

ఎన్నికల ఖర్చు నియంత్రణ అన్నది మరింత పెద్ద భూతం వలె అభ్యర్థుల గొంతు నులిమేస్తున్నది. ఎన్నికల చట్టం ప్రకారం అభ్యర్థులు లోకసభ ఎన్నికకు లక్షా యాభై వేలకు మించి ఖర్చు చేయకూడదు. నామినేషన్ డిపాజిట్ నుంచి ప్రతిదీ ఇందులోనే లెక్కపడుతుంది. అయితే వాస్తవంలో లోకసభ ఎన్నిక అంటే కనీసం కోటి రూపాయలు ఖర్చు వుంటుంది. ఇట్లా ప్రతిష్టాత్మకంగా జరిగే నియోజక వర్గాలలో ఖర్చుకు పరిమితి లేదు. నాలుగైదు కోట్ల ద్రవ్యం ద్రవం వలె కరిగి పోతుంది

అట్లా ఖర్చుకు అలవాటు పడిన నాయకులు, పార్టీలు కేవలం లక్ష యాభై వేలతో ఎన్నిక జరిపించ వలసి వస్తే ఏమై పోతారు? వారేమై పోయినా నాకు నష్టం లేదు, చేతనైతే చట్టం మార్పించు కోండి కాని, నిబంధనలను మించి ఒక్క రూపాయి వెచ్చించినా ఒప్పుకునేది లేదని శేషన్ భీష్మించుకొని కూర్చున్నారు. ఇందుకోసం ఆయన వ్యయ పరిశీలకులను కర్నూలుకు పంపారు. వారి పని అభ్యర్థుల పేరుతో జరిగే ఖర్చును పైసా పైసా కూడి అంచనా




వేసి శేషన్‌కు నివేదించడం. జెండా కట్టినా, కారు పెట్టినా లెక్కలో పడిపోతున్నది. అభ్యర్థుల స్నేహితులు, ఇతరులు, పార్టీలు పెట్టే ఖర్చుకు కూడా లెక్క కావాలంటున్నారు. ఈ కఠిన నియంత్రణ ఫలితమే, కర్నూలు ఎన్నిక అంత చప్పగా జరగడం.

రిగ్గింగ్ నిరోధానికి, పోలీసు బందోబస్తుకూ విస్తృత ఏర్పాట్లు జరిగాయి. కేంద్ర పోలీసు దళాలను బూత్‌ల దగ్గర నిలబెడతారట. కర్నూలులో సాధారణంగా రిగ్గింగ్ విలక్షణ శైలిలో జరుగుతుంది. లారీలలో కూలీలను తెచ్చి క్యూలో నిలబెడతారు. సాధారణ ఓటర్లు వారికి వెనుకగా నిలబడాలి. క్యూ మాత్రం అంగుళం ముందుకు జరగదు. లోపల కొందరు కూర్చుని గబ గబా ఓట్లు గుద్దేస్తారు. పని కాగానే అప్పటి వరకు క్యూలో నిలబడి వుండిన కూలీలంతా లారీ లెక్కి ప్రక్క గ్రామానికి తరలి పోతారు. నిజమైన ఓటర్లు లోపలకు పోయే సరికి వేయడానికి ఓట్లు వుండవు. ఈ పరిస్థితి గమనించే శేషన్ ప్రతి బూత్ దగ్గరా వీడియో కెమరాలు పెట్టమన్నాడు. క్యూలో కదలిక కన్పించకుంటే రిగ్గింగ్ క్రింద భావిస్తానని హెచ్చరించాడు.

వాహనాల పై ఆంక్షలు ఇప్పటికే కఠినంగా అమలు చేస్తున్నారు. ప్రచార బృందం ఒకేసారి కేవలం మూడు కార్లు లేదా జీపులు మాత్రమే వాడాలట. అంతకు దాటి కన్పిస్తే అక్కడి కక్కడే వాటిని సీజ్ చేసే అధికారం కల్పించారు.

ఎన్నికల సంఘం పరిశీలకులుగా వచ్చిన వారు అభ్యర్థులను మరింత భయ పెడుతున్నారు. కుమారి శాంత శీలా నాయక్ అనే అధికారిణి ఎమ్మిగనూరు ప్రాంతంలో పర్యటిస్తున్నారు. ఆమె కలెక్టరాది స్థానిక అధికారులను కూడా లక్ష్య పెట్టడం లేదు. నేరుగా గ్రామాలకు వెళ్లి ఓటర్లను కలిసి, గత ఎన్నికలలో మీరు నిర్భయంగా ఓటు వేశారా, రిగ్గింగ్ జరిగిందా, బయటి వ్యక్తులెవరైనా వచ్చి దౌర్జన్యంగా ప్రవర్తిస్తున్నారా అన్న ప్రశ్నలు వేసి సమాధానాలు వ్రాసుకుంటున్నారు. రిగ్గింగ్‌కు అవకాశ ముందని ఆమె అంచనా వేసే గ్రామాలలో ప్రత్యేక ఏర్పాట్లు చేస్తారట.

అన్ని రకాలుగా రాజకీయ వాదులను వేపుక తినడం అపూర్వం. ఒక విధమైన ఎన్నికల ప్రక్రియకు అలవాటు పడిపోయిన పార్టీలు, నాయకులు హఠాత్తుగా వచ్చిన ఈ మార్పులను జీర్ణం చేసుకో గలగడం కష్టమే. కాని, శేషన్ రాజీ పడడం లేదు. ఏ మాత్రం సందు ఇవ్వడం లేదు. ఆయనెంత దూరం పోతున్నా డంటే రిగ్గింగ్ అవకాశాలు, పెరుగుతున్న ఖర్చును కనిపెట్టను గ్రామాల్లో ఎన్నికల కమీషన్ తరఫున సాధారణ పౌరులనే గూఢచారులుగా

## శేషన్ భూతం

(మొదటి పేజీ కొరవ)

నియమించమని ఆదేశించారట.

శేషన్ మంకు పట్టు తెలిసిందే కాబట్టి ఎన్నికలలలోగా వచ్చే మార్పేమీ లేదు. రిగ్గింగు లేకుండా రాయలసీమలో ఎన్నిక జరిగితే ఎట్లా వుంటుందో వూహకు కూడా అందడం లేదు. అభ్యర్థుల భయం అదే. ముఖ్యమంత్రి కూడా చాలా ఆందోళన చెందుతున్నారు. జిల్లా తెలుగు యువత అధ్యక్షుడు శ్రీ డి. విష్ణువర్ధన రెడ్డిని చాకచక్యంగా పార్టీ ఫిరాయింప జేసుకొని కొంచెం ఊపిరి పీల్చుకున్నప్పటికీ, కాంగ్రెస్‌ను అంతకంటే పెద్ద దెబ్బ కొట్టింది తెలుగుదేశం. ఎమ్మెల్యే బుడ్డా వెంగళ రెడ్డి వారి పంచన చేరాడు. కెఇ కృష్ణమూర్తి కుటుంబ సభ్యులంతా అటే దూకి ముఖ్యమంత్రి భరతం పట్టడానికి ప్రయత్నిస్తున్నారు. అధిక సంఖ్యలో వున్న ముస్లింలు కాంగ్రెస్‌ను వ్యతిరేకిస్తున్నారు. ఈ పరిస్థితులన్నీ చూస్తే కాంగ్రెస్ భయపడక తప్పదు. కాని తన యాభై ఏళ్ల రాజకీయ జీవితా నుభవాన్ని పణంగా పెట్టి పనిచేస్తున్న ముఖ్యమంత్రి అంత సులువుగా పరాజయం అంగీకరిస్తారా? చివరి క్షణంలోనైనా ఆయన తిమ్మిని, బమ్మిని చేసి గట్టెక్క గలగడని కాంగ్రెస్ పరిశీలకుల వూహ.



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.